# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 15 రాజమహేంద్రనగరము 16-1-1991, 1-2-1992 సంచికలు 3, 4

—. ఈ సంచికలో రచయితలు .—

1. శ్రీ ఆవంత్స సోమసుందర్
2. డా॥ టి. బాలసుబ్బయ్య
3. డా॥ ఆర్. అన్నపూర్ణమ్మ
4. డా॥ మిరియాల రామకృష్ణ
5. డా॥ నండూరి వేంకటసుబ్బారామారావు
6. శ్రీ అన్వారి వాసుదేవశాస్త్రి
7. శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్
8. శ్రీ చిరావూరి శ్రీరామశర్మ
9. శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి



1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 20_00 6 మాసములకు రు 12_00 విడి ప్రతి రు 2_00

# సంపాదకుని మాట

దేశపురోగమనానికి విద్య పట్టుగొమ్మ. ఇది నిర్వివాదాంశము. ఏ వనరులు ఎన్ని ఉన్నా విద్యలేని మానవుడు సాధించగలిగేది ఏమీ ఉండదు. విద్యకు సముచితస్థానం లేనప్పుడు సంఘం ఏ అభివృద్ధీ సాధించలేదు. స్వభావరీత్యా మన దేశంలో అనేక భాషలు, అనేక సాంప్రదాయాలు ఉన్నాయి. భాష ఏదైనా భావం ఒక్కటే!

విద్యావ్యవస్థలలో చోటుచేసుకుంటున్న మార్పులు ఎంతవరకు అభివృద్ధిని సాధించేయన్నది చాలా అసంతృప్తికరంగానే ఉంది. మన దేశంలో మేధస్సుకు కొరతలేదు. కాని ఆ మేధస్సుకు సరియైన మార్గదర్శకత్వము, విలువ కొరవడినవి. ఎలిమెంటరీ విద్యనుంచి విశ్వవిద్యాలయాల పరిధివరకూ పాఠ్యప్రణాళికలను తయారుచేయడమే చాలా లోపభూయిష్టంగా ఉంది. ఎవరికి నొప్పి కలిగినా ఈ విషయంమాత్రం పచ్చి నిజం. క్రొత్త సిలబసు నిర్ణయం అవుతుంటి. ప్రశ్నాపత్రాలలో మార్పులు ఉంటాయి. కాని తరుణంలో వాటికి అవసరమైన టెక్ట్సు పుస్తకాలు ఉండవు. మాదిరి ప్రశ్నాపత్రం పరీక్షల ముందుగాగాని రాదు. ఇక పాఠ్య బోధన ఎలా సాగుతుంది? ఇన్ని అయినాక పరీక్షలు ఎప్పుడు జరుగుతాయో (వాయిదాలు లేకుండా) ఫలితాలు ఎప్పుడు వస్తాయో ఖచ్చితంగా చెప్పలేము. ఇవి అన్నీ అయి ఒక విద్యార్థి బైటపడినాక ఇక ప్రవేశ పరీక్షలు! ఇవి ప్రస్తుత సమాజంలో ఒక అర్థంగాని చిక్కుముడిగా మిగులుతున్నాయి. వీటి పేరుతో ఎంత డబ్బు వృథా అవుతోందో అందరికీ తెలుసు. ఒక కోర్సుకు అర్హమైన పరీక్ష గవర్నమెంటు పరీక్షలద్వారానో, విశ్వవిద్యాలయాలు నిర్వహించే పరీక్షలవల్లనో పాసైనప్పుడు ఇక ప్రవేశ పరీక్షలు ఎందుకు? అంటే అంతకుముందు నిర్వహింపబడిన పరీక్షలపై నమ్మకం లేకనా? అదే నిజమైతే తరువాత పరీక్షలపై మాత్రం నమ్మకం ఏమిటి?

విద్య వ్యాపారంగా ఉన్నంతవరకు ఈ సమస్యకు పరిష్కారం లేదు, ఉండదు.

నిజం మాట్లాడితే చాలా చేదుగా ఉంటుందిమరి!

—సంపాదకుడు

# సమాలోచన గురించి మీ అభిప్రాయం

'సాహిత్య పత్రికల కాలం అస్తమించింది' అని వాదించే వారికి ఒకే ఒక సమాధానం సమాలోచన సాహిత్య పత్రిక. కష్టనష్టాలకోర్చి ఒక పవిత్ర సంకల్పానికి కట్టుబడి మేమీ పత్రికను వెలువరిస్తున్నాం. నవ్యధోరణులను పరిశీలిస్తూ ప్రాచీన పద్ధతులను విశ్లేషిస్తూ ప్రాచీన నవీనతల మధ్య వంతెనగా ఉండాలన్నది మా ఆశయం. దానికి ఆశ్రయం పాఠకుల ఆదర మే. సమాలోచన ఈనాడు తెలుగులో ఒకే ఒక సాహిత్యపత్రిక అని పలువురు మాకు రాస్తున్నారు. మాతో అంటున్నారు. అయితే మీ అభిప్రాయం ఏ సమాలోచనను మీరు ఏవిధంగా సహకరించ[illegible]చారు? మీ ఆర్థిక హార్దిక సాహాయ్యం మాకేమిటి? క్రింది కూపను నింపి మాకు పంపండి. —(సంపాదకుడు)

Post To సమాలోచన
B. V. & Co., రాజమండ్రి-1.

మీ పేరు ____________

పూర్తి చిరునామా ____________

మీ సాహితీ మిత్రుని పేరు ____________

వారి చిరునామా ____________

____________

మీ చందా M.O. / D.D. తేదీ నెం.
జతపరచండి.

సంతకం.

వెనుక ప్రక్క మీ అభిప్రాయం
వ్రాయండి.



## శుభాకాంక్ష

ఉ. సంకురుమయ్య భూప్రజకు
సర్వ శుభంబులఁ గూర్చ నెంచి, యీ
పంకజనేత్రి భూసతిని
భాసుర సస్యవిభూషఁ జేసె, నే
వంకను గాంచినన్ జనులు
వారిత మోద సుధాబ్ధి యందునన్
గ్రుంకులు వెట్టుచుండి రది
గో! మధుర క్షణ మిద్ది మిత్రమా!

—శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి



★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

# తెలుగు సాంస్కృతిక జీవనంలో ఆధునికతా వికాసం

(గత సంచిక తరువాయి)

— శ్రీ అవంత్స సోమసుందర్

ఆదినుంచీ కవిత్వంలో 'ఏం చెప్పాలి?' అనే చింతనకు ఎంత ప్రాధాన్యతవుందో– 'ఎలా చెప్పాలి?' అనే యోజనకూ అంతే ప్రాముఖ్యత వుంది. కాని రాను రాను కవిత్వం సోమరిపోతులైన కొందరయ్యల వినోదార్థం ఉపయుక్తమయ్యే పదార్థంగా మారిపోయింది అతర్వాతనే ఏం చెప్పాలి అనేదానికి ప్రాధాన్యత క్షీణించింది. ఎలా చెప్పాలన్నదానికే విపరీత ప్రాముఖ్యత ఇవ్వబడింది. ఈ ఒరుగొమ్ము మధ్యయుగాలలో ప్రారంభమైంది. ముఖ్యంగా ప్యూడల్ ప్రభువుల ఆస్థాన నర్తకిగా కవిత్వం మారిన తర్వాతనే మరీ గిడసబారింది. ఎలా చెప్పాలన్న సాధనలోనే ప్రయోగ వైపరీత్యం ప్రబంధయుగంలో చెప్పబడే విషయానికి ప్రాముఖ్యత తగ్గిపోయింది.

పాండురంగని మాహాత్మ్యం స్థాపించడానికి ఉద్దేశించబడిన కావ్యంగా చెప్పబడుతున్న ప్రబంధంలోనైతేం– భ్రష్టాచారపరాయణుడూ ఆశ్రయమిచ్చిన ప్రతివారికీ ద్రోహం తలపెట్టిన విశ్వాసఘాతుకుడూ– నిగమశర్మ గురించిన ఉపాఖ్యానమే అత్యధిక ఆకర్షణీయంగా చిత్రితమైంది. పాండురంగ మాహాత్మ్యం చదివితే– మొత్తం కావ్యంలో ఆ భ్రష్టుని చరిత్రే పాఠక హృదయంలో నిలిచిపోతుంది. ఇది యాదృచ్ఛికంగా జరిగినదేంతమాత్రం కాదు. కవి బుద్ధిపూర్వకంగా తన ప్రతిభనంతా (దుర్)వినియోగించి తన శిల్పచాతురినంతా బలిపెట్టి కల్పించినదే! తానాశ్రయించే రాజుల

## నవయుగ రేఖలు

ప్రీత్యర్థం తెనాలి రామకృష్ణకవి ఇలా ఈడిగలపడ్డాడు.

కవులు తమ ప్రజ్ఞాపాటవాలను వినియోగించి సమాజోద్ధారణకోసం పాటుపడ్డంమాని మరింత భ్రష్టాచారం కలిగించడానికే ప్రయత్నించారు. శ్రీకృష్ణదేవరాయల పరిపాలనకు కలిగిన ప్రఖ్యాతి ధర్మమా అని ఆ యుగీనకవిత్వానికైతేం స్వర్ణయుగమన్న గుడ్డిగుర్రపు తాపులో మన సాహిత్య చరిత్రకారులు జారిపోయారు. గతానుగతికంగా అదే మాట పదేపదే పలువురి నోళ్ళలోనూ నలుగుతోంది. ఆ యుగంలోనే కవిత్వం కేవల వినోదపదార్థంగా మారింది. రాజాస్థానాలకు పరిమితమవడం ప్రారంభమైంది. తద్వారా ప్రజానీకానికి దూరమైపోయింది. ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాల నిర్మాణం కోసం ఒళ్ళు హూనం చేసుకుంది. విప్రవినోదుల ఇంద్రజాలవిద్యవలెనో, దొమ్మరసానుల గెడపై మొగ్గలవలెనో అబ్బురం కలిగించడమే పూచీగా పెట్టుకుంది. ఆనందానుభవంద్వారా చిరంతన స్మృతిదీపికలు వెలిగించలేకపోయింది. ఆనాటి కవిత్వం మనస్సుకే పని కల్పించిందితప్ప రసస్థానీయమైన హృదయాన్ని రంజింపచేయలేకపోయింది.

ఇదే తదుపరి క్షీణయుగ కవిత్వానికి మాతృస్థానీయమైంది. ప్రజల మనోభావాలకు విషముష్టులుగా తయారైన వికారభావాలు ప్రచలితమయ్యాయి. రాజాంతఃపురాలకు మాత్రమే పరిచితమైన పాత్రలతో ప్రబంధాలు నింప

బడ్డాయి. చివరికి మధ్యతరగతుల అక్షరాస్యులకు సైతం అందని గగనకుసుమాలయ్యాయి. సంస్కృత భాషాజ్ఞానం ఉంటేతప్ప తెలుగు ప్రబంధం అర్థంకాని దుస్థితి ఏర్పడింది. కవిత్వానికి జీవలక్షణమైన హృదయ ద్రావకశక్తిని కోల్పోయి నిర్జీవాలయ్యాయి. మహాకవి గురజాడ చెప్పినట్లు "హిస్ మెజెస్టీస్ హార్ట్"కు నివేదించని సాహిత్యం శవతుల్యమే. అందుకే ఆ మహనీయుడు 'కొయ్యబొమ్మల మెప్పు కనులకు కోమలులౌ సొరెక్కునా?' అని తీవ్రంగా ప్రశ్నించారు. పరకీయా సంపర్క శృంగారాన్ని, వేశ్యాసంగమాభిరతిని, సామాజిక భ్రష్టాచారాన్ని, అవినీతిని ఆకర్షవంతం చేయనారంభించాయి. రాజుల పోరంబోకు లక్షణాలకు, తుంటరి పనులకు, తెంపరి నడతలకూ గౌరవాదరాలు కలిగించనారంభించాయి. విస్మరించవలసిన విషయాలను గోరంతలు కొండంతలుగా వర్ణించి- కవులు బానిసతొత్తుల వలె బ్రతుకనారంభించారు. రాజుల బహుభార్యాత్వంతోపాటు, వేశ్యాలోలత్వాన్ని సైతం ఒక నైతికహక్కుగా, మహాపౌరుషకార్యంగా కొనియాడే నైచ్యానికి కవులు దిగజారారు. ఈ దుష్టాచారం నిన్న మొన్నటివరకూ మన సాంఘిక జీవితాన్ని కలుషితమొనరుస్తూనే ఉన్నదంటే ఈ విషవృక్షాల వ్రేళ్ళు ఎంత లోతుగా పాతుకుపోయాయో అర్థంచేసుకోవచ్చు.

వీరేశలింగంగారికాలం వరకూ ఉపభార్యల నుంచుకోవడమే సామాజిక గౌరవంగా, హోదాగా పరిగణింపబడేది. అందువల్లనే ఆ మహనీయుడు వేశ్యాలంపటత్వాన్ని నిరసిస్తూ అనేక ప్రహసనాలు రచించవలసివచ్చింది. రఘుపతి వెంకటరత్నంగారు కళావంతుల సంస్కరణను క్రిందివరకూ తీసుకుపోవలసివచ్చింది. ఏన్టినాచ్ అనేది ఒక సాంఘిక నినాదంగా మారిపోయింది. దీని ప్రభావంతోనే వరవిక్రయం, చింతామణి, మధుసేవ వంటి సంఘసంస్కరణోద్యమ నాటకాలు రచించిన మహాకవి కాళ్ళకూరి నారాయణరావు తాను స్వయంగా కళావంతుల సంస్కరణోద్యమంలో పాల్గొనడమేకాక, ఒక కళావంతుల కులంనుంచి వచ్చిన కన్యను వివాహం చేసుకొని ఏటికెదురీదారు. ఆమె గౌరవానికి ఎక్కడా ఎప్పుడూ భంగం కలగకుండా యితర వివరాలు గొప్పకో, మైనా చెప్పకుండా 'ఆమె నాభార్య' అని మాత్రమే మిత్రులకు పరిచయం చేసేవారు.

ఒకప్రక్క ముద్దుపళని, మోహనాంగి ప్రభృతులు ఎంత నీచశృంగారాన్ని చిత్రిస్తూ రాధికాస్వాంతనం వంటి కావ్యాలు రచించినా, వేరొక ప్రక్కగా అదే దశకు చెందిన పసుపులేటి రంగాజమ్మ మన్నారుదాసవిలాసాది యక్షగానాలు రచించి, ఆనాటి శిష్టజన వ్యావహారిక భాషకు ఆదరణ కలిగించింది. తంజావూరు రాజుల కాలంలోనే ప్రజల కళారూపాలకు ప్రభువుల ఆదరణ లభించింది. వైయాకరణుల ముష్కరత్వానికి వసివాడిన జనప్రియ సాంస్కృతిక రూపాలు సాధారణ ప్రజల రసనలపైనే కాపురం పెట్టుకున్నాయితప్ప అక్షరలోకంలోనికి ప్రవేశించలేకపోయాయి. అట్టివానికి తంజావూరు నాయకరాజుల కాలంలోనూ, మహారాష్ట్ర రాజుల కాలంలోనూ సభాగౌరవం సిద్ధించింది. వ్యావహారిక భాషకుసైతం కొంతవరకైనా బంధవిముక్తి కలుగనారంభించింది. యథేచ్ఛగా ప్రయోగించి గ్రంథాలు రచించే ధైర్యం ఆ కాలంలోనే ఏర్పడింది.

ఈ నేపథ్యంలోనే పంతొమ్మిదో శతాబ్ది ఆరంభమైంది. తిక్కన్నగారు తమ కాలంలో ప్రజల నాలుకలపై త్రుళ్ళింతలాడిన కమ్మని జాను తెనుగునే భారతరచనకు వినియుక్తం చేశారన్న సత్యం చైతన్యవిలసితమైంది. దాదాపు అదే కాలానికిచెందిన అన్నమాచార్యులు తన సంకీర్తనాసాహిత్యాన్ని జాను తెనుగు నుడికారంతోనే వ్యావహారిక పలుకుబళ్ళతోనే సౌందర్యవంతం కావించారు. ఆయన ముద్దులాడు, దోపరి వంటి వేలాది పదాలు స్వేచ్ఛగా ప్రయోగించి తెలుగుభాషకు గౌరవం కలిగించారు.

కాని శ్రీనాథుని కాలంనుంచీ సంస్కృత సమాస జాటిల్యమే తెలుగు కవిత్వంగా గణుతికెక్కింది. శ్రీహర్షుని నైషధకావ్యాన్ని అంగీకరించడంతో శ్రీనాథుడెంతో స్వతంత్రించాడు. స్త్రీయుక విలాసవీథిలో యథేచ్ఛావిహారం చేశాడు, కాని సంస్కృత భాషకు తెలుగు క్రియలు చేర్చనబాపటుగా దాన్ని బిగించి తదుపరి కాలంలో ప్రవర్తిల్లిన ప్రబంధ సాహిత్యానికి అపమార్గం కలిగించాడు. అదే దారిలో సాగిన అల్లసాని పెద్దన మనుచరిత్రను తీర్చిదిద్ది ప్రబంధకవితా పితామహుడనిపించుకున్నా- అతని కవితావృక్షపు వ్రేళ్ళన్నీ శ్రీనాథుని బొందికిందే లోతుగా పాతుకున్నాయి. శ్రీనాథునికాలంనుంచే కవితాశ్రేణిలో- మౌలికతను సాధించేందుకు ప్రయత్నించినవారికన్నా అనుకర్త లధికమైపోయారు. ఇది దాదాపు ఒక వ్యాధిగా విస్తరించింది.

ఏ సాహిత్య సన్నివేశంలోనైనా ప్రతిభామహత్త్వపూర్ణులు సకృత్తుగానే ఉంటారు. విశిష్టశక్తిసంపన్నులయిన కవితాకంఠాలు బహుకొద్దిగానే ప్రభవిస్తాయి. ప్రతిధ్వనులు కోకొల్లలుగా సామూహిస్తాయి. ఇది కవితాకళ విషయంలో కూడ యథార్థమే. గతానుగతిక ప్రవర్తకులు అసంఖ్యాకంగానూ మౌలిక ప్రయోగకారులతి అల్పంగానూ ప్రచలిత మవుతూంటారు. స్వకీయమైన జ్ఞాన

క్రియాశక్తితో సమకాలీన లోకాన్ని చకచ్చకిత మొనర్చగల కొందరే శాశ్వతంగా అమృతుల మవడమూ, తక్కింగల అసంఖ్యాకులు ప్రతిధ్వని మాత్రులు గానూ మిగిలిపోతూంటారు. ప్రతిధ్వనులు సైతం తాత్కాలికంగా ముచ్చట కొలుపుతూండటమూ చారిత్రక యథార్థమే! అలాంటి వారిలో అత్యధిక సంఖ్యాకులు కాలప్రవంతిలో మణిగిపోతూంటారు.

నన్నయ్యకు పూర్వం నుంచీ వచ్చిన తెలుగు పద్యసాహిత్యంలో మహాకవులు మాత్రమే మిగిలారు. ఎందరో చిల్లర మల్లర కవులు కాలాన్ని ఎదిరించలేక నిష్క్రమించారు. ఈ పరిస్థితి శ్రీనాథుని కాలం తర్వాత మరీ మితిమీరిపోయింది. ఈ శ్రేణికవులు శ్రీనాథుని కాలంలో సైతం తామరతంపర లైపోవడంవల్లనే— అతనికి చిరాకుపుట్టి వుంటుంది. 'బూడిద బుంగనై యొంగ మై పోడిమిదక్కి ... గాడిద! నీవుకూడ కవివి గాదుకదా అనుమానమయ్యెడినే!' అంటూ కొండవీటి గాడిదను ముద్దు చేయవలసివచ్చింది!

ఇలాంటి అనుకర్తలగుంపు 19 వ శతాబ్దంవరకూ ఒత్తిడిగా వ్యాపించడమే కనిపిస్తుంది ఆ శతాబ్దంలోని సాధారణకవుల మాటకేం—ముఖ్యంగా శాస్త్రుల ఎత్తున కనిపించిన చామకూర వెంకటకవి సారంగధర చరిత్రలోనే విపరీత అనుకరణశీలిగా ప్రదర్శించుకున్నాడు. 'అల్లన గాధిరాజసుతుడర్మిలి మేనక ముద్దొనర్ప' .. వగైరా పద్యం, అల్లసానివాని — 'అపరిమితానురాగ కుసుమోల్లసయై చిగురాకు చేతులన్ ...' అనే పద్యానికి మక్కీకి మక్కీ అనుకరణేకదా! విజయవిలాసంలో చామకూర పాకాన పడిందని తక్కింగల వారు మెచ్చుకున్నా—ఆ కావ్యంలో సైతం మనుచరిత్రకీ వసుచరిత్రకీ ఉన్న అనుకరణలను ఏరిపారేస్తే మిగిలేది పుంజెడు భాగమే! ఇలాంటి తృతీయశ్రేణికవిని సాత్తికత్తువని ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు అంతలావు వ్యాఖ్యానం రచించడం అతని కవిత్వ మహత్వంవల్ల కాదని, ఇతరేతర కారణాలవల్లనే అని అర్థమై పోతూనేవుంది. తాతాజీని శాశ్వతంగా జ్ఞాపకం చేసుకోదగిన పూచీని జాతికి కలిగించిన గ్రంథం అదికానేకాదు. వారు జాతిని తట్టిలేపి ఆలోచింపచేసిన గ్రంథాలు—'దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు?' వంటివే! అవే ఆయన్ని చిరస్మరణీయ మార్గదర్శిగా నిలుపుతాయి.

ఇంతకీ చెప్పదలచిన సత్యంఏమిటంటే ప్రతియుగంలోనూ ప్రజ్ఞాపూర్ణహృదయులు కొద్దిగానే ఉంటారు. వారి కంఠాలే సర్వేసర్వత్రా ప్రకంపనలు కలిగిస్తూంటాయి. వారికే ప్రతిధ్వనులు అపారంగా ఉత్పత్తిల్లుతాయి. దీపం చుట్టూ మూగే వానాకాలపు ఈసుళ్ళు ఎంత అనంతంగా వ్యాపించినా అవి కాంతికిరణాలందించలేవు.

ఈ పరిస్థితి 19వ శతాబ్దంలో సైతం తెలుగు కవిత్వపరంగా యథార్థంగానే నిలచింది. కాని ఆ శతాబ్దంలోనే జాతి హృదయానికి నూత్నసత్యాలు సుబోధకమయ్యాయి. ఆంగ్లవిద్యాభ్యాసానికి తెరచబడిన తలుపులు విశాల లోకావలోకనానికే వెలుగుకిరణాలయ్యాయి దానితో కొందరైనా వైతాళికులు ముందుగా మేలుకున్నారు. జాతిలో వినూత్న జనసత్వం స్థాపించ నారంభించారు. మనం బ్రతుకుతున్న ఈ శతాబ్దాన్ని సంపన్నయుం చేసిన మహనీయులంతా ఆ శతాబ్దంలో జననమందినవారే! వారంతా ఆంగ్లవిద్యాభ్యాస మందించిన నూతనలోకంతో ముందుగా మేల్కాంచినవారే! శస్త్రచికిత్సద్వారా మనజాతికి తొలగించ వలసిన రాచపుళ్ళను ముందుగా పరికించ గలిగిన వారే! అట్టి వారే యావద్భారతంలోనూ ప్రాదుర్భవించారు. జాతిని జాగృత మొనర్చారు. మహనీయులుగా చరిత్రలో నిలచిపోయారు.

తంజావూరు నాయక రాజుల కాలంలో ఆ ప్రాంతానికి తరలిపోయిన తెలుగు వాణి—ఆ రాజులపోషణలో ప్రవర్థిల్లింది. విజయనగర సామ్రాజ్యోత్తర కాలాన్ని సాహిత్యపరంగా మరో వెలుగు వెలిగించినదీ నాయక రాజుల కాలమే! ఆ యుగంలోని చివరి కాంతులుగానే తెలుగు జాతి నాటక ప్రక్రియావిశేషంగా యక్షగానం సముద్ధరించబడింది. వ్యావహారిక భాషాప్రయోగానికి ఆదరణ లభించింది. ఆ కాలంలో తంజావూరుకు తరలిపోయిన తెలుగు విద్వత్ కుటుంబాలలో కాకర్ల వారిదొకటి. తంజావూరు పరిసరాలలో స్థిరనివాసం ఏర్పరచుకుని, కలాసాగా కాలక్షేపం చేస్తున్న తెలుగు కుటుంబాలలో కాకర్లవారు ప్రశస్తినందినవారే. పంచనదీ క్షేత్రమైన తిరువయ్యూరులో వారె స్థిరపడ్డారు. ఆ కుటుంబ పరంపరలో రామబ్రహ్మం మంచిపండితులు. వారి ద్వితీయ కుమారునిగా 1770 లో జననమందిన త్యాగరాజు తెలుగుసంస్కృతాలలో అశేషపాండిత్యాన్ని సంపాదించి సంప్రదాయ సంగీతంలో నిష్ణాతుడయ్యాడు. ఆయన శాస్త్రీయసంగీత సమర్థతగా వాగ్గేయకారుడయ్యాడు. అసంఖ్యాక రాగాలకు ధాతు మాతు పుష్టిచేకూర్చాడు శుద్ధవ్యావహారిక భాషా మాధుర్యంతో, రసాలూరించే తెనుగు నుడికారంతో మనోజ్ఞ పల్లవులు సంతరించి వేలాది కృతులు విరచించాడు. నను పాలింప నడచివచ్చితివా, రారా మాయింటిదాక, ఉపచారము చేసేవారున్నారురా— వంటి అసంఖ్యాక మధుర పల్లవులు తెలుగు రసనలపై సదా రమణీయ రసవాహినులై తనవారాయి.

లో కవితాభినివేశాన్ని ప్రోత్సహించడానికని కవిత్వరచనలో పోటీ ఏర్పరచగా 1899లో రచించిన కావ్యానికి ప్రథమ బహుమతి లభించింది. ఆ కావ్యమే ముసలమ్మ మరణం. ఇది ప్రబంధ ఫక్కీకి చరమగీతం. ఆగామి నూతన కవితాక్షేత్రానికి మంగళాహ్వానం! ఇందలి పద్యాలన్నీ అనూన సంప్రదాయబద్ధత నుంచి పుట్టినవే! అభివ్యక్తిలో గాని, కవిసమయాలలో గాని, సంప్రదాయ విధేయతే ప్రధానం. కాని వస్తువరణంలో సంపూర్ణ నూతనత్వం ప్రదర్శితమైంది. గ్రామస్థులను వరద వారుతున్న చెరువు గండం నుంచి కాపాడటం కోసం_ఒక విశుద్ధకన్య ఆ ఉద్రిక్తగంగకు ఆత్మార్పణ కావించుకోవడం యిందలి ఇతివృత్తం. ఆ బలిదానం వల్ల గంగ శాంతిస్తుందని గ్రామజనుల మూఢవిశ్వాసం! దాన్నే శిరసావహించి ఒక రైతు కుమార్తె పదహారేళ్ళ కోడలు బలైపోయింది. ఆ వీరురాలి పేరు ముసలమ్మ. కొంద రపజ్ఞులు పేర్కొన్నట్లు ఆమె ఓల్డు ఉమెన్ కాదు.

అంతవపూర్వం ఆనూచానంగా కావ్యనాయకులు దేవతలో! పితృదేవతలో! ధీరోదాత్తులో! ధీరలలితులో! సాధారణ రైతు కుమార్తె నాయికగా ప్రతిష్ఠింపబడటమే ఈ కావ్యం సాధించిన నవ్యత! అందువల్లనే ముసలమ్మ మరణం_దేహళీదీపకంగా ఇరవయ్యో శతాబ్దికి నాందిగా నూతన కాంతులు ప్రసరించింది, 1900 సం॥లో ముసలమ్మ మరణం గ్రంథంగా ప్రచురింపబడింది. మాననీయత నందుకుంది.

గతానుగతిక సంప్రదాయ కావ్యనిర్మాణపద్ధతికి ముసలమ్మ మరణం స్వస్తి పలికింది. అనవసర అష్టాదశ వర్ణనల కట్టు పరంపరలకు ఉద్వాసన చెప్పింది. పురుషపాత్రనాయకత్వానికి సెలవు చీటీ అందించింది. మందికోసం ఆత్మత్యాగం చేసి చరిత్రలో గౌరవస్థానం కల్పించింది. సామాజిక వాస్తవికతకు బీజావాపనం కావించింది. పద్యనిర్మాణంలో ప్రాచీన పద్ధతినే అనుసరించినా వస్తువైవిధ్యం వల్ల ముసలమ్మ మరణం ఇరవయ్యో శతాబ్దానికి వెలుగురు తలుపులు తెరచింది. ఆగామి నూత్న కవానికి స్వాగత గీతమైంది.

ఉత్తరోత్తరా కట్టమంచి సాహిత్య విమర్శలో ఆధునిక వివేచనా శీలిగా ఆర్యులయ్యారు. అందువల్లనే_'కావ్యసౌభాగ్యరేఖలను మీమాంసించి తెరవని వాకిళ్ళు తెరచినావు, ఆంగ్లభాషీయ వాహిని మథించి గీటుకొట్టి కదను తొక్కించినావు. కరుణ మెత్తదనాలు కలిపి పైకొన వాదవేదికాగ్రముల కల్పించినావు కట్టమంచి రసాలశాఖ ఫలంబ!' అంటూ రాయప్రోలువారు హృదయపూర్వకంగా కీర్తించారు.

(ఇంకా ఉంది)

(●●●)

# వేదుల సూర్యుని జ్ఞానమహస్సు

— డా. టి బాలసుబ్బయ్య

(గత సంచిక తరువాయి)

ఈవిధంగా రామాయణంలో అంతర్గతంగా ఉన్న సాధనావిధానాన్ని అందులోని పాత్రలు, స్థలాల పేర్ల అంతరార్థాలూ, వాల్మీకే స్వయంగా చెప్పిన నిగూఢోపమానాలూ ఆధారంగా శర్మగారు వివరించారు. అట్టి వానిలో ఒకటి రెండింటిని చూతాం.

1. బాలకాండంలో అహల్యావృత్తాంతం ఆసక్తికరంగా ఉంది. దేవనాథుడైన ఇంద్రుడు - గౌతమమహర్షి భార్యయైన అహల్యల అక్రమసంబంధ గాథ ఇది. కాని అంతర్యంలో 'అహల్య' అన్న దానిలో 'హల్య' అనగా హలంతో అనగా నాగలితో దున్నదగినది, అహల్య అంటే దున్ని-సంస్కరించ వీలులేని బీడుపడి ఉండలి మూలవాసనాబీజం అని అర్థం. అహల్య గౌతముని భార్య అంటే - గోతముడు అనగా ఇంద్రియవృత్తుల ఉద్రేకాన్ని అణచే సాధకుడు గౌతముడు. ఇతని పోషణలో ఉంది మూలవాసనా బీజం అని అర్థం. దీన్ని సాధకుడు ఎంత అణచినా అది మనస్సుతో (ఇంద్రునితో) కలిసి ఆనందించడమే అహల్య ఇంద్రునితో వ్యభిచరించడం అన్నదాని అర్థం. అప్పుడు సాధకుడు (గౌతముడు) దీన్ని గుర్తించి ఈ మనోవాసనల (ఇంద్రాహల్యల) కలయిక పునర్నవ వాసనలను కలిగించేదిగా ఉండకూడదనే మనస్సును (ఇంద్రుని) అఫలుడు (వృషణరహితుడు) కమ్మని నిగ్రహించాడు (శపించాడు) అని అర్థం. వాసనా బీజక్షేత్రాన్ని (అహల్యను) జ్ఞానానంద యోగం లభించేదాక (రామపాదరజం సోకేదాక) నిశ్చలంగా జడసమాధిలో ఉండేటట్లు చేశాడు (రాయిపడి ఉండమని శపించాడు) అంటే వాసనాబీజాన్ని మనస్సు నుంచి నిశ్చలస్థితికి తీసుకొని రావడం అంటే సాధకుడు అమనస్క యోగం పొందడం అనే ప్రముఖమైన సాధనా రహస్యమే అహల్యాశాపవృత్తాంతంగా చెప్పబడినట్లు శర్మగారు పేర్కొన్నారు.

2. సీతారాముల కళ్యాణానంతరం దశరథుడు రామునికి పట్టాభిషేకం చేయదలచగా కైక దానికి అడ్డుపడి రామునికి

వనవాసం భరతునికి పట్టాభిషేకం చేయించింది అధ్యాత్మిక పరంగా ఇక్కడ సాధకుడికి జరిగే విఘ్నం చెప్పబడింది. రాముడు సీతను వివాహం చేసుకోవడం అంటే ఆనంద రూపజ్ఞానం ప్రకృతిని వశీకరించుకోవడం అని అర్థం. అప్పుడు దశరథుడు రామునికి పట్టాభిషేకం చేయదలచడం అంటే సాధకుడు తన సాధనలో పరిపూర్ణతను పొందినట్లుగా భ్రమపడి, తాను ఇతర సాధనలతో నిమిత్తం లేకుండా సత్వరజస్తమో వాసనలన్నిటిని తనలో ఐక్యం చేసుకొని బ్రహ్మసాక్ష్యాన్ని పొందగలనని తొందరపడి నిర్ణయించడమే అని అర్థం. అప్పుడు సాధకునిలోని తమోగుణాన్ని (కైక అను క+ఏక = అంటే ఏకాగ్రతకు ముఖ్యంగా గల తమోగుణం) మంథర ద్వారా ప్రేరేపించి తమోగుణ వాసనలను రెచ్చగొట్టి తీవ్రతరమొనర్చడం. (మంథం అంటే కవ్వం. దాని స్వభావాన్ని గ్రహించేది మంథర అంటే మనస్సును కలచి వేసే. తమోవృత్తి) రెచ్చగొట్టి పట్టాభిషేక ప్రయత్నానికి విఘ్నమాచరించింది.

ఈ సందర్భంలో కైక కోరిన వరాలను అంతరార్థపరంగానే వాల్మీకి చెప్పాడు. కథాపరంగానే అయితే కైక రామునికి రాజ్యం రాకుండా తన కొడుక్కు దక్కడమే ముఖ్యం. ఆమెకు రాజ్యభ్రష్టత పొందిన రాముడు ఎక్కడికి వెళ్ళేది, ఏం చేయాల్సింది అవసరం లేదు. కాని ఆమె రాముని రాజ్యభ్రష్టతకు పదునాలుగేండ్లు అవధిని నిర్ణయించి, ఆ సమయంలో రాముడు ఎక్కడుంటే ఏం చేయాలో నిర్దేశించింది—

"నవపంచ చ వర్షాణి దండకారణ్య
మాశ్రితః।
చీరాజినధరో ధీరో రామో భవతు
తాపసః॥"

అని కైక రాముడు 14 ఏండ్లు దండకారణ్యంలో ఉండి, నారచీరలు, జింక చర్మం ధరించి ధృఢుడై తపస్సు చేయాలనే నియమం విధించడం వాచ్యార్థానికి అనవసరం. దీన్ని అంతరార్థ దృష్టితో చూస్తే తప్ప సరియైన సమాధానం దొరకదు.

దండక + అరణ్యం—అంటే శిక్షగల చేతోవృత్తి ప్రశమన స్థితిలో (రణ్యం అంటే రణయోగ్యం. యుద్ధస్థితి - అంటే భావ సంఘర్షణ. అటువంటి ప్రశాంతస్థితే అరణ్యం) పద్నాలుగు సంవత్సరాలు అంటే దశేంద్రియ సమూహానికి, అంతఃకరణ చతుష్టయానికి ప్రశమనస్థితిని కల్పించే విధంగా సాధనను సాగించాలన్నదే దీనికి అంతరార్థం. అంటే మోక్షాన్ని కోరే సాధకుడు దశేంద్రియనిగ్రహస్థితిని (దశరథ సాధనను) సాధించిన తర్వాత 14 ఇంద్రియాలను ప్రశమనపరచే సాధన చెయ్యాలన్న సాధనా రహస్యం ఇందు గర్భితం.

3. సముద్రలంఘనం చేసేటప్పుడు హనుమంతుని సింహిక అనే ఛాయాగ్రాహి రాక్షసి సముద్రంలో కనిపించకుండా ఉండి అతని గమనాన్ని నిలిపివేసింది. అప్పుడు హనుమంతుడు సుగ్రీవుడు హెచ్చరించిన ప్రకారం ఆంజనేయుడు సింహికను నిగ్రహించాడు. సాధకుడు తనకు ఎదురయ్యే అడ్డంకులను జ్ఞానదృష్టితో ఎదుర్కొని నివారించుకోవాలనే సాధనా రహస్యం ఇందులో ఇమిడి ఉంది. ఇక్కడ హనుమంతుడు సింహికను నిగ్రహించిన విధం వివరిస్తా -

(శేషం)

# చిత్తూరు తెలుగు వ్యావహారిక భాషపై తమిళభాషా ప్రభావం

—డా॥ ఆర్. అన్నపూర్ణమ్మ

ఆంధ్రప్రదేశ్ లోని సరిహద్దుజిల్లాల్లో భాషాశాస్త్రదృష్ట్యా ప్రధానమైన జిల్లా చిత్తూరుజిల్లా. చిత్తూరు పట్టణం కేంద్రంగా ఈ జిల్లాకు ఈ పేరు వచ్చింది. ఈ జిల్లాకు పడమర కర్ణాటక రాష్ట్రం. ఉత్తరాన కడప, తూర్పున నెల్లూరుజిల్లా మరియు తమిళనాడు రాష్ట్రం దక్షిణాన తమిళనాడు రాష్ట్రం ఉన్నాయి. భాషాపరంగా చిత్తూరుజిల్లా రాయలసీమ మాండలికానికి చెందినది. అందువల్ల రాయలసీమ సామాన్య లక్షణాలు ఈ జిల్లాలో సాధారణంగా కనిపిస్తాయి. ఇవిగాక కన్నడ, తమిళ భాషాప్రభావాలు కూడా ఈ జిల్లా తెలుగు వ్యావహారికంలో కన్పించడానికి చాలా అవకాశాలున్నాయి. కానీ తమిళ భాషా ప్రభావమే ఎక్కువ మోతాదులో ఉన్నట్లు తెలుస్తున్నది. దీనికి కారణాలు చాలా ఉన్నాయి. ఈ జిల్లావారికి సమీప ప్రధాన వాణిజ్య కేంద్రం మద్రాసు పట్టణం కావటం వల్లను, తమిళులు ఎక్కువ సంఖ్యలో ఈ జిల్లాలో స్థిరపడటంవల్లను తెలుగు వ్యావహారికంలో తమిళ భాషా ప్రయోగాలు ఎక్కువగా కనిపిస్తాయి. పై కారణాలేగాక వివిధ వ్యాపారస్తులు ఈ జిల్లాకు రావడంవల్లను, చదువుకొరకు, బంధుత్వంకొరకు, పనులకొరకు వలసపోయి రావడంవలన చిత్తూరు తెలుగు మిశ్రమ తెలుగుగా మారింది. చిత్తూరు పట్టణం తమిళనాడు సరిహద్దుకు ఆనుకొనియుండట

తమిళ భాషా ప్రభావంవలన చిత్తూరు వ్యావహారికంలో ఒక్కొక్కప్పుడు సగం తెలుగు, సగం తమిళం అయిన కొన్ని ప్రయోగాలు ఇక్కడ వినిపిస్తూ ఉంటాయి. అవి పదం తెలుగు, ప్రత్యయం తమిళం అయిన ప్రయోగాలు ఇలా ఉంటాయి.

దా/దానే ప్రత్యయాన్ని వివిధ అర్థాలు వచ్చేట్లు పలుసందర్భాలలో తెలుగు పదాలతో కలిపి ప్రయోగిస్తుంటారు.

ఉదా -

1. కొన్ని సందర్భాలలో ఈ ప్రత్యయం 'ఏ' వార్థకాన్ని సూచిస్తుంది.

ఉదా - తెలుగు

వాళ్ళు'దా' వచ్చినారు
అదే'దా' ఉండాది
'నేను'దా ఆ పని చేస్తిని

తమిళం

అవంగ'దా' వందార్
అదు'దా' ఇరుక్కు
నాన్'దా' అందవేలై సైదే(న్)

2. కొన్నిచోట్ల ఈ ప్రత్యయం ఇలాగే, ఈవిధంగా అనే అర్థం సూచిస్తుంది.

ఉదా - తెలుగు

ఇదే బతుకు'దా' మేము బతుకుతా ఉండాము.
(కూటికి, గుడ్డకి కూడా నోచుకోలేని జీవితం అని వారి అర్థం)

తమిళం

ఇదు దా/దాన్ ఎంగళ్ పొళప్పు

3. మరికొన్ని సందర్భాలలో అవసరమున్నా లేకున్నా ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

ఉదా - తెలుగు

1. నువ్వు అవుల్ని బాగదా మేపుకొనిరా.
2. రేపు'దా' వడ్లు ఉడకబెట్టాల.
3. గుడ్డలు'దా' ఉతకాలి.
4. పనికి'దా' పోయిండాడు.

తమిళం

1. నీ పకుంగళై నల్లదా తిరిపిక్కిట్టువా
2. నాళెక్కి'దా' నెల్లు వేగాక్కిణం
3. తుణిగళ్'దా' తోక్కిణం
4. వెలెక్కిదా పోనాన్
5. రెక్కిల్దా(న్) పోట్టికిట్టుపోనుం.

పైవిధంగా ఈ 'దా' ప్రత్యయాన్ని తెలుగు పదంతో కలిపి ప్రయోగిస్తుంటారు. అలాగే పదం తమిళం ప్రత్యయం తెలుగైన కొన్ని ప్రయోగాలుకూడా ఇక్కడ వినిపిస్తూ ఉంటాయి

ఉదా -

పూడ్సినాడు - పూడ్సు - ఇనా - డు

పూడ్సినాడు ప్రయోగం తమిళ భాషా ప్రభావంవలన వచ్చి ఉంటుంది. ఇది తమిళంలో పోయిటాన్ (పోయి + విట్టాన్) అని అంటారు. భూతకాల ప్రత్యయం, ఇనా - పురుష ప్రత్యయం, డు - తెలుగుకి సంబంధించినవి అయి పూడ్సు మాత్రం తమిళానికి సంబంధించి వుండటం విశేషం.

మరికొన్ని తమిళ ప్రయోగాలుకూడ చిత్తూరుజిల్లా వ్యావహారికంలో వినిపిస్తూ ఉంటాయి. అవి 1) వందు, 2) పోడు రెండలగునవి ఎక్కువగా ఉపయోగించటం అలవాటు చేసుకున్నారు.

వందు -

తెలుగు

ఉదా :- మా చిన్నాయన వచ్చి సేద్యం చేస్తాఉంటారు. ఇది తమిళంలో అయితే ఇలా ఉంటుంది.

ఎంగ చిత్తప్పా వందు సేద్యం పణ్ణరాంగ

పోడు -

తెలుగు

ఉదా :- అమ్మా నాకు అన్నం పెయ్యి
(అంటే అన్నం పెట్టమని అర్థం)

ఇది తమిళంలో అయితే ఇలా ఉంటుంది.

అమ్మా ఎనక్కు సాదం పోడు.

'వందు'ను వచ్చి అనే అర్థంలోను, 'పోడు'ను పెయ్యి/పెట్టు అను అర్థంలో ఈ జిల్లావారు ఈ ప్రయోగాలను తమ వాడుకభాషలో ప్రయోగిస్తూ ఉంటారు.

ప్రశ్నార్థకాలలో 'ఏ'కి బదులు 'యా' విరివిగా వాడుకలో ఉంది.

ఈ యా ప్రశ్నార్థకంకూడా తమిళ భాషా ప్రభావంవలనే వచ్చి ఉంటుంది.

| ఉదా - | తెలుగు | తమిళం |
|---|---|---|
| | యాండడి ? | యన్నాదదు |
| | యావూరు ? | యన్నావూరు |
| | యాడికి ? | యంగేపోరే ? |
| | (పోతావు) | |

ఈ జిల్లా వ్యావహారిక భాషలో కొన్ని పదాలకు అర్థాలు ఈవిధంగా ఉండడానికి కారణంకూడా ఈ తమిళ భాషా ప్రభావమే అయిఉంటుంది.

ఉదా :- తెలుగు

సెలవు - ఖర్చు, విరామదినం, ఆజ్ఞ
శెలవులు - సరుకులు, వెచ్చాలు
ఎత్తు - కొను, పైకి లేపు

'సెలవు' అనే పదానికి 'విరామదినం' 'ఆజ్ఞ' అను అర్థాలు తెలుగునాడు అంతటా ఉంది, కాని చిత్తూరుజిల్లావారి వ్యావహారికంలో ఈ పదానికి 'ఖర్చు' అనే అర్థంకూడా ఉంది. సెలవు అంటే 'ఖర్చు' అని అర్థం తమిళ భాషలో ఉంది. శెలవులు అనే పదానికి సరుకులు, వెచ్చాలు అనే అర్థంలో ఈ జిల్లావారు పై పదాన్ని ప్రయోగిస్తారు ఈ పదం తమిళంలోనిది. అర్థంకూడా సరుకులు అనే అర్థం ఉంది. కాని ఈపదం మిగతా జిల్లాలలో లేదు. చిత్తూరుజిల్లావారు తమిళ భాషా ప్రభావంవలన ఈ పదాన్ని తమ వాడుకభాషలో ప్రయోగించుకుం

టున్నారు. 'ఎత్తు' అనే పదానికి 'పైకి లేపు' అనే అర్థం తెలుగునాడు అంతటా ఉంది. కానీ చిత్తూరు వ్యావహారికంలో రెండో అర్థం 'కొను' అనికూడా ఉంది. తమిళంలో 'ఎడు' అను పదానికి 'కొను' అనే అర్థంఉంది. తమిళ భాషా ప్రభావం వలన చిత్తూరుజిల్లావారు 'ఎత్తు' అను పదానికి కొను అనే అర్థంతోను వ్యావహారికంలో ప్రయోగిస్తున్నారు. ఉదాహరణకి కొన్నివాక్యాలు క్రింద ఇవ్వబడినాయి.

తెలుగు

ఇంట్లో దుడ్లు చానా సెలవు అయింది.
(ఇంట్లో డబ్బు ఎక్కువగా ఖర్చు అయింది)

తమిళం

వీట్టిల్ పణం రొంబా సెలవు ఆనదు.

తెలుగు

నేను ఇంటికి సెలవులు తేలేదు.
(నేను ఇంటికి సరుకులు కొనలేదు)

తమిళం

నాన్ వీట్టికు సెలవు వాంగలే

తెలుగు

పండగకు గుడ్డలు ఎత్తాం.
(పండుగకు గుడ్డలు కొనాలి)

తమిళం

పండిగైక్కు తుణిగళ్ ఎడక్కణాం.

ఇవేగాక తమిళపదాలు అలాగే, అదే అర్థంలో తెలుగు వ్యావహారికంలో కలిపి మాట్లాడుతూ ఉంటారు.

ఉదా .. తెలుగు

నువ్వు ఆ జన్నలు తెరువు.
(నువ్వు ఆ కిటికీలు తెరువు)

తమిళం

నీ అంద జన్నలై తెర

తెలుగు

నువ్వు వస్తువుల్ని పైకి తూకు.
(నువ్వు ఆ వస్తువుల్ని పైకి ఎత్తు)

తమిళం

నీ అంద పొరుళై మేలకి తూకు.

తెలుగు

నీకు అరువు ఉందా.
(నీకు బుద్ధి ఉందా)

తమిళం

ఉణ్ణుకు అరివి ఇరుక్కా.

తెలుగు

నేను వాణ్ణి తుప్పను.
(నేను వాణ్ణి లెక్క చేయను)

తమిళం

నాన్ అవనై తుప్ప మాట్టేన్.

తెలుగు

వాని బతుకు కండ్రావి బతుకుగా ఉంది.
(వాని బతుకు ఘోరంగా ఉంది)
(కష్టంగా ఉంది)

తమిళం

అవన్ పొళప్పు కండ్రావియా ఇరుక్కు.

తెలుగు

వాడు ఇంటికి పూడ్సినాడా?
(వాడు ఇంటికి వెళ్ళాడా)

తమిళం

అవన్ వీట్టుకు పోయిటానా?

తెలుగు

నీకు వాడు అడియాళమే తెలియలేదా?
(నీకు వాడు గుర్తు తెలియలేదా)

తమిళం

ఉనక్కు అవన్ అడియాళం తెరియలే?

తెలుగు

రేపు నేను తనీగా వస్తాను.
(రేపు నేను ఒంటరిగా వస్తాను)

తమిళం

నాళెక్కి నాన్ తనియా వరేన్

తెలుగు

నేను మార్కెట్టులో తక్కాళికాయలు కొన్నాను.
(నేను మార్కెట్టులో రామములక్కాయలు కొన్నాను)

తమిళం

నాన్ మార్కెట్టిల్ తక్కాళికాయ వాంగనే.

పై వాక్యాలే కాకుండా పదాల పట్టిక కూడా క్రింద చూపించడమైనది.

– పదాల పట్టిక –

| చిత్తూరుజిల్లా పదాల పట్టిక | తెలుగు పదాల పట్టిక |
|---|---|
| అగలం | వెడల్పు |
| అదుమానం | తాకట్టు |
| అడియాళం | గుర్తు |
| అరకాంజట్టి | కూరపట్టి |
| అరువు | తెలివి బుద్ధి |
| అల్లికాడ | తామరకాడ |
| అల్పుసి నెల | ఆశ్వయుజమాసం |
| అలుగు | బ్లేడు, కత్తి |
| అప్స్యాగు | తడపర |
| అండా | రాగికాగు |
| ఆడి నెల | ఆషాఢమాసం |
| ఆణి నెల | జ్యేష్ఠమాసం |
| అయాడి | శంకుస్థాపన |
| ఆవణి నెల | శ్రావణమాసం |
| ఆండపాప | అమ్మాయి |
| ఇడితాంగి | చువ్వ (పిడుగుపడకుండా ఇంటిపైన పెట్టు చువ్వ) |
| ఇన్నూరు | రెండు వందలు |
| ఉచ్చి | తల మధ్యభాగం |
| ఉబ్లాంకోడి | ఒకరకపు తీగ |
| ఉరుట్లు | ఇంటికి ఉపయోగించు కర్రసామాన్లు |
| ఉరువదు | గట్టెక్కు |
| ఉళవాయి | ఇరుసు |
| ఉళాంగాసు | గుత్తే పోవు, సొట్టు |
| ఊత్తుకోట్ట | ఒక ఊరు పేరు |
| ఎచ్చిపారికి | ఆడుకొనుట, తిండికి తిరుగుట |

| | |
|---|---|
| ఎదుర్చి | ఎదిరించు |
| ఎల్ నీరుకాయ | లేత కొబ్బరి బొండం |
| ఒబ్బిడి | ధాన్యం శుద్ధి చేయుట |
| ఓలి | కట్నం |
| కట్టాయం | తప్పకుండా |
| కడగాలు | పుసాగులు |
| కడాణి | బండిచక్రం దగ్గర ఉంచు మేకులు |
| కదిరికోలు | రాట్నం |
| కనకపిళ్ళె | ఊరు కరణం |
| కన్నాడియం | చిన్న అరటిఆకు (గెల వేయుటకు ముందు వచ్చు ఆకు) |
| కరిడి | ఎలుగుబంటు |
| కరిమి | లోభి |
| కవుడు | కపటం |
| కంద్రావి | ఘోరం |
| కొత్తాడి | తంటా |
| కాపుకట్టు | కంకణం కట్టుట |
| కాయిల | జబ్బు |
| కాలువానీ | పావువంతు |
| కడిమె | కండ |
| కేడుగాలం | చెడుకాలం |
| కొట్టాపుడి/ కొట్టాపురి | ఒకరకపు కర్ర సామాను |
| కొయ్యకల్లి | రుబ్బుగుండు |
| కొంకి మరం | చెరకు గానుగకు వాడు పెద్దపొడవైన కర్ర |
| కొండాటం | సంతోషం |
| కొండి మేళ | వంకరగా ఉండు మేకు |
| గాండా మృగం | జంతువు పేరు |
| గిరాకి | ధర |
| గుజ్జాలు | చిన్నకర్రలు |
| గుత్త | కాలు |
| గుబ్బ | రాగులపై ఉండు పొట్టు |
| గూడకాదు | దొప్పచెవి |
| గోందు | జిగురు |
| చిత్తిరెల | చైత్రమాసం |
| చిత్రిపట్టు | చెక్కను నునుపు చేయు |
| జలువు | ఏటవాలు |
| జమ్మని | అందంగా, హాయిగా |
| జన్నలు | కిటికీలు |
| జిల్లాంకోడి | క్రాగిల్లి |
| జట్టుపడిమి | చిన్న టింక |
| తక్కాళికాయలు | టమోటాలు, రామ్ములక్కాయలు |
| తగరారు | తగాదా |
| తడవ | ఒకసారి, ఒక పర్యాయం |
| తడంగలు | అడ్డంకులు |
| తనీగా/తని | విడిగా/ఒంటరిగా |
| తరిణపెట్టు | చెక్కకు రంధ్రం చేయుట |
| తలారి | గ్రామ మునసబుదగ్గర పనిచేయువాడు |
| తాలుకొట్టు | తప్పనూర్పులు |
| తుప్పాట | లెక్క చేయుట, గౌరవించుట |
| తుండ్లు | ముక్కలు |
| తూవ | పైకిఎత్తు, చిన్న రాగిదుత్త |
| తూవవేసుకొను | ఉరివేసుకొను |
| తూంగు | నిద్రపోవు |
| తెలుంగు | తెలుగు |
| తేగడ | మురికి |
| తైరువడ | పెరుగువడ / ఆవడ |
| తైనెల | పుష్యమాసం |
| తొడుకులు | తొడిక |
| తొంగు | వేలాడు |
| 'దా' | 'ఏ' కారం |
| దామణి | ఓణి, పరికిణి |
| దుడ్డు | డబ్బు |
| నట్టాయి/నెట్టాయి | తన్నుడుకర్ర |
| నడక్కాడు | జరదు |
| నయ్యన/నాయిన | నాగన్న |
| నాయిపల్లి | కత్తులపల్లి, ఊరుపేరు |
| నిండ | నీడ |
| నూనెకడిమె | నూనెమంత |
| పడిగట్లు | మెట్లు |
| పడుగు | పరుచు |
| పదరు / వదరు | భయపడు, జడవు |
| పరంబులోలుట | పెద్ద చెక్కతో పొలాన్ని చదును చేయుట |
| పళి | నింద |
| పళ్ళిటాన్నికి | బడికి |
| పంగుణి నెల | పాల్గుణ మాసం |
| పండబెట్టు | పడుకోబెట్టు |
| పాలెడ | ఉగ్గు గిన్నె |
| పావడ | లంగా |
| పిత్తళి | ఇత్తడి |
| పిళ్ళారి పండగ | వినాయక చవితి |
| పిళ్ళాంగట్టి | పిల్లనగ్రోవి |
| పుట్టి | 80 శేర్లు |
| పుల్లాన్సు | గిలక, పెద్ద బావికి వేయు రాట్నము |
| పువ్వాంబరం | చక్రకేళి |
| పూడ్సినాడు / పూషినాడు | వెళ్ళినాడు |
| పూర్లు | గడ్డితో పేడిన దారం |
| పెరటాసినెల | భాద్రపదమాసం |
| పెరిమ | గొప్పతనం |
| పేయి | దయ్యం |
| పైత్యం | పిచ్చి |
| పొన్ని | బంగారు తీగలు (వడ్ల తెగ), బంగారు |
| బార్సి | ఒకరకపు కర్ర సామాను |
| బిసోమని | జోసిగా, కలితిగా |
| బీరాంజా | తప్పుతోయు |

| | |
|---|---|
| బొక్కసాయి | బోసినోరు |
| మద్దై | తర్కం |
| మణగాసనం | సిమెంటు పూత |
| మణ్ణు | మట్టి |
| మళిగ | బట్టలకొట్టు |
| మార్గళినెల | మార్గశిర మాసం |
| మాశి | మాఘమాసం |
| మిచ్ఛం / మిచ్యం | మిగత / శేష భాగం |
| మిన్నల్ | మెరుపు |
| ముక్కాలువాసి | మూడవ వంతు |
| ముక్కాలు ముర్వీసం | మూడవ వంతు |
| మొట్టకన్ను | పెద్దకన్ను |
| మొట్టగోసు | క్యాబేజీ |
| మొట్టాల్‌తనం | తెలివి తేనితనం |
| మురుకులు | చక్రాలు, జంతికలు |
| ముందిరిపప్పు | జీడిపప్పు |
| మూట | బస్తా |
| మూళై | మెదడు, బొమిక |
| మైకట్టు | బండికి కిందభాగం లో వుండు దిమ్మ |
| మొదలారి | ఇంటికి పెద్ద |
| మోడం | మబ్బు |
| యణ్ణం | మనస్సు |
| యారాళం | ఎక్కువ |
| వడకవురు | మోకుదారం, లావుదారం |
| వరుంబడి | ఆదాయం |
| వర్తం | కష్టనష్టాలు |
| వలిమె | బలం |
| వండ | నష్టం, బాధ |
| వాద్దరమ్మ | టీచరు |
| వారిపోయిం | ఎత్తిపోయి |
| వీణ సెలవు | వృధా ఖర్చు |
| వెళకతిప్పి | దీపప్రమిదలు |
| వెళ్లాయి | తెల్లదనం |
| వైయ్యాశినెల | వైశాఖమాసం |
| శెలవులు | సరుకులు |
| శిలమానం | కూడబెట్టిన డబ్బు |
| శీదా | సొత్తం |
| శెల్లం | చనువు, గారం |
| సమిటి, సంటి | సమ్మెట |
| చక్కరసారం | పరమాన్నం |
| సూల, సూళ్ | ఇటుకబట్టి |
| సెలవు | ఖర్చు |
| సిన్నికల | వల |
| సంగటం | ఇరుకునపడు, సందిగ్ధపడ్డ |
| సంబండి | వియ్యంకులు |
| సంబళం | జీతం |
| సాంబేరి | సోమరి |
| సుడుగాడు | శ్మశానం |
| సుణ్ణం, ఘణ్ణం | సున్నం |

కొన్ని పదాలు తమిళం తెలుగుమిశ్రమమైన పదాలు కొన్ని ఉన్నాయి, అవి

1. కొంకిమరం 2. కొయ్యకల్లి 3. ఉప్లాం కొడి 4. కొట్టాపుడి, పులి 5. పడిగట్టు 6. ఆయంపట్టు 7. నూనెపడిమె 8. ముందిరి పప్పు 9. గూడకాడు 10. మొట్టాల్‌తనం.

చిత్తూరుజిల్లావారు పై పదాల పట్టికలోని పదాలను తమ అవసరాలకొద్దీ వాడుక భాషలో ప్రయోగించుచుంటున్నారు. వీరి భాషలో అనునాసికములు కూడ ఎక్కువే. పైవిషయాలన్నీ పరిశీలించి చూస్తే ఈ జిల్లా వ్యావహారిక భాషలో తమిళ భాషాప్రభావం ఎంతగా చొచ్చుకొనిపోయి ఇమిడిపోయి ఉందో తెలుస్తున్నది.

## References ·

1) ఆంధ్ర, తమిళ, కన్నడ త్రిభాషా నిఘంటువు - సంపాదకులు : 1. వేదము వేంకటరాయలుశాస్త్రి, 2. శర్మ, 8 తిరుమల రామచంద్ర.

2. తెలుగు మాండలికాలు - చిత్తూరు జిల్లా, 1983. సంపాదకుడు : బూదరాజు రాధాకృష్ణ.

3) A Dravidian Etimological Dictionary - T. Burrow and M B Emeneau, Oxford University Press, Ely House, London W,I, 1961

4) A study on Loan Words in Telugu from cognate languages (unpublished thesis) Andhra University, 1977 - By G.V.S R Krishna Murthy.

* * *

ఆర్. అన్నపూర్ణమ్మ
తెలుగుశాఖ,
నాగార్జున విశ్వవిద్యాలయము,
గుంటూరు,

—0—

మనుచరిత్ర పునశ్చరణం - 10

# హిమాలయం మీద మహోదయం

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

గంధర్వుడు ఆకాశంలో తిరిగేవాడు. ప్రవరుడు నేలమీద తిరిగేవాడు. ఆకాశచారికి భూచారి వేషం వచ్చిందీ అంటే అది అతను కావాలని తెచ్చుకున్నదే. వరూధినికూడా ఆకాశచారిణియే. ఆమెకు భూచారిమీద మనసు కలిగింది. అదే ఆమె బలహీనత. ఆ బలహీనతని స్వార్థానికి వాడుకున్నాడు గంధర్వుడు. నిజరూపంలో అతడాపని చేయలేకనే దొంగవేషం ధరించాడు. వేషమేకాదు వాచికంకూడా మార్చుకున్నాడు. కానీ దొంగ తన పని పూర్తయ్యేదాకామాత్రమే నటించగలడు. తరవాత అతనికి అవసరంలేదా వేషం. దొంగప్రవరుడు వరూధినిని సుఖపుగా లొంగదీసుకున్నాడు. వరూధినిని కళ్ళు మూసుకోమన్నాడు. తన కోరిక నెరవేర్చుకోగల్గాడు. ఆసక్తి ఎంతపనినైనా చేయిస్తుంది.

నిజానికి వరూధిని దివ్యకాంత కావడంవల్ల ఆమెకు రెప్పపాటు (నిమేషత్వం) ఉండదు. కానీ ఆమె తన కళ్ళనెలా మూసుకోగలిగింది? ఈ ప్రశ్నకు కవి పెద్దన సమాధానం చెప్పవలసి వచ్చింది. ఆమె కళ్ళు రసపారవశ్యంవల్ల మూతలుపడ్డాయన్నాడా మన లోకంలో కళ్ళుమూసుకుపోయాయి అనడం జాతీయం. ఆమెకు తన జతగాని స్వరూపం తెలియదు. కానీ ఆమె మనసుకుమాత్రం అతడు నిజమైన ప్రవరుడే అనిపించింది. దానికి కారణం మాయాప్రవరుడు నిజమైన ప్రవరుడి దేహంలోని అగ్ని కాంతిని అందుకోగలిగాడు. దీన్ని శాస్త్రీయంగా మనం అంగీకరించలేం. అయితే కవి దీన్ని "శాంబరీమహిమ" అన్నాడు. అదొక మర్మవిద్య. ఆ విద్యవల్ల అతడు నిజమయిన ప్రవరుడిగా మారాడు. కనుక ఆమెకు కలిగిన గర్భంలో నిజప్రవరుడి బీజమే పడింది అది ఆమె భావనయొక్క పర్యవసానం.

వరూధినికి తొమ్మిదినెలలూ నిండాయనడం మానుషమైన పునరుత్పత్తి క్రమం (Sexual reproduction) లోని శాస్త్రీయమైన అంశమే. ఆకాశయానం చేసే ఒక స్త్రీ ఇక్కడ క్షేత్రం. ఆ క్షేత్రంలో పడిన బీజం సైతం ఆకాశయానం చేసే పురుషుడిదే![1] కానీ మానసికమైనభావన (Mental illusion) ఒక్కటే భూమండలానికి చెందినది. కానీ శరీరంమాత్రం దివ్యమైనదే! అలా పుట్టిన శిశువును భావించడమే మనుచరిత్రలోని గొప్పవిషయం. అలా పుట్టిన ఆ శిశువుయొక్క తేజస్సు ఎలాగుంటుంది? అది ఈ ప్రపంచంలో వెలిగించిన దీపంలాగుందన్నారు పెద్దనగారు.[2]

ఆ అబ్బాయిని చూసి జనులు నమస్కరించారని పెద్దన అంటాడు. ఎక్కడివారీ జనులు? హిమాలయంలోని జనాలేనా? అనే సందేహం మనకి మిగిలిపోతుంది.[3]

అతన్ని చూసి దేవతలు పూలవానలు కురిపించారంటాడు కవి. ఇది కేవలం 'కవిసమయం'లాగే కనిపిస్తుంది.[4]

ఆ పసివాణ్ని మునులంతా వచ్చి చూశారట. వారికి ఆ కుర్రవాడి జన్మరహస్యం తెలియదా? అని మనం ప్రశ్నిస్తే జవాబుండదు. ఆ పసివాడి కాంతిముందు సూర్యచంద్ర నక్షత్రాల కాంతులన్నీ వెలవెలబోయాయనడం ఒక అతిశయోక్తిలా కనిపిస్తుంది. అందుకనే మునులంతా అతనికి "స్వరోచి" అని నామకరణం చేశారట. ఇలాంటి ఘట్టాలన్నీ కేవలం పురాణ సంప్రదాయాలే.[5]

అతనికి విద్యలన్నీ నేర్పేశారు ఆ మునులే. ఈ విద్యాభ్యాసం గురించి చాలా స్థూలంగా చెప్పారు పెద్దన. సంయమి సమాజం (Society of saints) దయవల్ల అతనికి బ్రాహ్మణ విద్యలూ క్షత్రియవిద్యలూ కూడా లభించాయి. ఆయుధాలతో యుద్ధం చేయగల్గడం, వేదాల అర్థాలు గ్రహించడం ఇవీ ఆ విద్యలు.[6]

స్వరోచి బాల్యం గురించి కాకుండా యౌవనం గురించే పెద్దన ఎకాయెకి వర్ణన చేశాడు. మంచిదే. కథకు ఏది అవసరమో దాన్నే చెబుతున్నాడన్నమాట. ఈ యౌవనాన్ని మామూలు రూపంలో కాకుండా ప్రశ్నావృత్తంలో

ద్విత్వప్రాసంలో చెప్పడం పాత్రప్రాయ శిల్పం అవక తప్పదు.[7]

అతడు హిమగిరిమీదనేకాకుండా కుల పర్వతాలన్నింటిమీదా విహరించాడు. అతని పిడికిలి బలమయింది. ఆ పిడికిలితో గోత్రపర్వతాలను బ్రద్దలుకొట్టే క్రీడలను (Sports) మొదలుపెట్టాడు. అతని కత్తి ఒక్క దెబ్బతో చెట్లను తుండిస్తోంది. ఇదీ అతని శౌర్యాన్ని తోపింపజేయడానికి పెద్దనగారి అత్యుక్తి వైభవం.[8]

అతని విల్లు ఏనుగుతొండమంత పెద్దది అంటాడు కవి. దాన్ని ఎక్కుపెట్టి బాణాలు వదిలితే ఎంత పెద్ద రాయియైనా ముక్కలయిపోతోందట! అంతటి ధనుర్విద్య అతనిది [9]

ఈ వర్ణనల్లో పెద్దనగారు ఒక ఆదర్శ వీరుడ్ని (An ideal hero) చూపించదలచుకున్నట్లు స్పష్టమవుతుంది. వాస్తవానికెప్పుడూ ఒక మెట్టు పైన ఉండేదే ఆదర్శం అని వేరే గుర్తుచేయనక్కర లేదు.

స్వరోచి రాజ్యం హిమగిరిమీదనుంచి మంథరపర్వతంమీదికి మారిపోయింది. అక్కడ అతనికోసం విశ్వకర్మ (The devine architect) ఒక నగరాన్ని నిర్మించాడు. అందులో అతని ఆస్థానం. చుట్టూ ఉన్న అడవుల్లో నివసించేవారంతా అతని సేన (Army) గా మారారు. అతను సామ్రాజ్యం అనుభవిస్తున్నాడు.[10]

ఇక మనకు వరూధిని గురించి ఏమీ తెలియదు. ఇక్కడినుంచి స్వరోచి కథే ముందుకు సాగిపోతుంది. అందువల్లనే మనుచరిత్రలో మొదటిభాగం తృతీయాశ్వాసంతో ముగుస్తోంది. నిజానికి అదే ఆంధ్రులనాకర్షించిన ఘట్టం. కాని నిజానికి స్వరోచి చరిత్రమే మనుచరిత్ర అవుతుంది. దానికి ముందుభాగమంతా వరూధిని చరిత్ర. అదంతా మనుచరిత్రకు ఒక ప్రస్తావనమాత్రమే. స్వరోచి చరిత్రను శ్రద్ధగా చదవడం మన కలవాటు కాలేదు. కాని స్వరోచికథకూడా ఆసక్తిదాయకంగా ఉంటుందా లేదా? పరిశీలించి తేల్చుకోవలసిందే మరి!

## అధ్యయన సూచికలు

1 మున్ను విప్రాకారమున కూడుచో కింక కనుమూయు పనిచెనా ఖచర భర్త .. ఆ ప్రతిజ్ఞాపూర్తి యయ్యె తనంత నవ్వానికిని రతిపారవశ్య పటిమ... తత్ప్రవర దేహసమిద్ధ శిఖి దీప్తి శాంబరీ మహిమచే సంగ్రహించి .. మేటి గర్భంబు నెలలు తొమ్మిదియు నిండె-3వ పద్యం.
2. తేజంబబ్జభవాండ గేహమునకున్ దీపాంకురచ్ఛాయమై-5వ పద్యం.
3. కుమునోరాజన్య మౌన్యాక్ జనుల్ జేజేపెట్ట-5
4. ప్రసూనవర్ష మమరశ్రేణుల్ ప్రవర్షింపగన్-5
5. స్వరుచి స్ఫురణను శశిభాస్కర పావక తారకాప్రకాశములెల్లన్ విరళములం జేయ నతనికి స్వరోచి యనునామ మిడిర చటి మునులెల్లన్-6
6. సంయమిసమాజ వినిర్మిత జాతకర్ముడై-వివిధాయుధంబులన్ గరితరిత్రై రణస్థలుల గద్దరియై - గవి మార్గశేదియై - వెరతవశాడునై మెరసె-7.
7. స్రగ్ధర-21వ ఛందస్సు మ-ర-భ-న-య-య-య గణాలు 15 యతిమైత్రి
8. క్రుద్ధున్ గోత్రాచలంబుల్ గులగుల యయిపో గోతముల్ గ్రుద్దులీలన్-చెండాడు ప్రౌఢల్-కత్తినొక్క ఘాతన్- వాతాద్భుతగతిపరచున్ భూమి జవ్వాడగా-8.
9. వేదండముతో సరి కోదండము-ఛేదించున్ గండశిలల పృథుబాణములన్-9
10. మంథక్షితిభృత్తటి విశ్వకర్మ చేసిన నగరి-10.

(*.*)

### సహృదయ పాఠకులకు విజ్ఞప్తి!

"మనుచరిత్ర పునశ్చరణం" ధారావాహిక వ్యాసాలు పది పూర్తయ్యాయి. వీటిని ఎంతో ఆదరంతో ప్రచురించిన సమాలోచన సంపాదకవర్గానికి కృతజ్ఞతలు. సహృదయ పాఠకులు కొందరో, అందరూనో వీటిని పరిశీలించే ఉంటారు. అయితే, ఈ వ్యాసాలను ఇలా మనుచరిత్ర పూర్తి అయ్యేదాకా కొనసాగించాలా? వద్దా? అనేది పాఠకుల, సాహిత్య విశ్లేషకుల అభిప్రాయం మీద ఆధారపడిఉంది. ఇంతవరకూ సాగిన ఈ పరిశీలన గురించి నిష్పాక్షికమైన మీ అభిప్రాయాలను క్రింది చిరునామాకు వెంటనే రాయండి. దాన్నిబట్టి భవిష్యత్కార్యక్రమాన్ని నిర్ణయించుకుంటాను.

మీ
మిరియాల రామకృష్ణ
25-6-5/3, జయకృష్ణపురం,
రాజమండ్రి-5.

# పోతన ప్రహ్లాద చరిత్ర - ఒక సమీక్ష

—డా॥ వందూరి వేంకటసత్యరామారావు

(గత సంచిక తరువాయి)

కథాకథనము :–

పోతన భాగవతావతారికలో 'ఆంధ్ర కవితాగౌరవ జనమనోహరి నన్నయభట్టారకుం గైవారంబు సేసి హరిహరచరణారవింద వందనాభిలాషిఁ దిక్కనమనీషిన్ భూషించి భక్తివిశేషిత పరమేశ్వరుండగు ప్రబంధపరమేశ్వరుం బ్రణుతించి మఱియు నితరపూర్వకవిజన సంభావనంబు గావించి వర్తమానకవులకుం బ్రియంబు పలికి భావి కవుల బహూకరించి' (స్కం 1-ప 10) అని చెప్పినాడు. పోతన కవిత్వమునకు ఈ త్రయము వారి కవితాగుణము లాదర్శములని భావింపవచ్చును. నన్నయ ధారాశుద్ధి, తిక్కనరసస్ఫూర్తి, ఎఱ్ఱనసూక్తివైచిత్రి పోతనకవితయందు సాక్షాత్కరించును.

పోతన–

'కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱికి సంస్కృతము గుణము
రెండున్
గొందఱికి గుణములగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై
యెడలన్.'
(స్కం 1- ప 8)

అని తనశైలిని గూర్చి వివరించినాడు. సంస్కృతాంధ్రముల రెండింటి యందును మేటి కావుననే ఇట్టి ప్రతిజ్ఞ చేసి నిలబెట్టుకొనగలిగినాడు. తెలుగు పదములు సంస్కృతపదములు కలసి పటిష్ఠమైన పదబంధమును కలిగించినవి దీని వలన గంగాప్రవాహమువంటి పద్యధార కలిగినది. కావుననే పోతనపద్యములు, పద్యపాదములు లోకోక్తులు సామెతలుగా ప్రజాసదోహములోనికి చొచ్చుకొని పోగలిగినవి. ఇందుల కుదాహరణముగా–

1. 'చదువని వాఁడజ్ఞుండగు' (స్కం 7-ప 130)
2. 'మందార మకరంద మాధుర్యమునఁ దేలు' (స్కం 7-ప 150)
3 'చదివించిరి నను గురువులు;' (స్కం7-ప 166)
4. 'కమలాక్షు నర్చించు కరములు కరములు' (స్కం7-ప 169)
5. 'కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే,' (స్కం 7-ప 170)
6. 'సంసార జీమూత సంఘంబు విచ్చునే' (స్కం7-ప 171)
7. 'అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి' (స్కం 7-ప188)
8. 'చెప్పెడొక చదువుమంచిది' (స్కం 7-ప 210)
9. 'దిక్కయ్యాది యదియు నాకు దిక్కు మహాత్మా' (స్కం7-ప 265)
10. 'కలఁడంభోధిఁ గలండు గాలి ' (స్కం 7-ప 274)
11. 'ఇందుగల డందులేడని ' (స్కం 7-ప 275)

మున్నగు పద్యములను పేర్కొనవచ్చును.

కథాకథనములో కూడ పోతన పద్ధతి జనరంజకమైనది. అందువలననే భాగవతమునందలి ప్రతికథ తీర్చిదిద్దినట్లుండును. పరీక్షిత్తు శాపము, గజేంద్రమోక్షణము, వామన చరిత్రము, ప్రహ్లాద చరిత్రము, రుక్మిణీకళ్యాణము మున్నగు కథలను పేర్కొనవచ్చును. పోతన ప్రతి కథయందును రచనావైవిధ్యమును ప్రదర్శించెను. కాని అన్నికథలయందొకే పద్ధతి నాశ్రయించలేదు.

ప్రహ్లాదచరిత్రము నందాసురలక్షణమునకు దైవికలక్షణమునకు జరిగిన సంఘర్షణము చిత్రింపబడినది. ఈసంఘర్షణము వలననే ప్రహ్లాదుని కథకొక స్థానము ఏర్పడినది. ఈసంఘర్షణము నుద్దీపింపచేయుటలోనే పోతన కథాకథన శిల్పము వ్యక్తమగుచున్నది. హిరణ్యకశిపుడు దితికుమారుడు హిరణ్యాక్షుని సోదరుడు. హిరణ్యాక్షుడు విష్ణువుచేత చంపబడెనని విని సర్వలోక సంహారమునకు పూనుకొనెను. హిరణ్యాక్షుని భార్యను, పిల్లలను ఓదార్చెను. "ఈ ప్రపంచములోనికి జీవులువచ్చుట పోవుటసాధారణము." ఆవిధముగనే హిరణ్యాక్షుడును వచ్చెను. పోయెను. కావున పుత్రవియోగమునకు నీవు విచారింపవలదనుచు యముడు ఉశీనరుని భార్యలకు చెప్పిన సుయజ్ఞోపాఖ్యానమును తల్లికిచెప్పెను. దేహిపుట్టుట గిట్టుట తథ్యము. మరణమునుండి తప్పించుకొనుట అసాధ్యము. తాము కూడ ఒకనాడు చనిపోవుట తథ్యమని తెలిసినను చనిపోయిన వారిని గూర్చి విచారించెదరు. ఈ తత్త్వమునే పోతన–

మచ్చిక వీరికెల్ల బహుమాత్రము
చోద్యము దేహి పుట్టుచున్
జచ్చుచునుండఁ జూచెదరు చావక
మానెడువారి భంగినీ
చచ్చినవారికేడ్చెదరు చావుకునొల్లక
డాఁగవచ్చునే?
యెచ్చటఁ బుట్టెనచ్చటికి నేగుట నైజము
ప్రాణికోటికిన్'
(స్కం 7-ప 46)

అని వివరించినాడు సర్వజ్ఞుఁడు, సర్వాత్ముఁడు, అవ్యయుఁడు, అనంతుఁడు, అను

లుడు, సత్యుడు, అద్యుడు, ఈశ్వరుడు, ఒక్కడేయని, అతడే తన మాయాప్రవర్తన మహిమవలన గుణములను కల్పించునని, ఆ గుణసంగమము చేతనే లింగశరీరమును ధరించునని తెలిసికొనిన మహాజ్ఞాని హిరణ్యకశిపుడు. సృష్టిరహస్యమును, మాయాస్వరూపమును, పరమేశ్వర లక్షణములను తెలిసినవాడు. హిరణ్యాక్షుని భార్యను, తన తల్లియగు దితికి కావించిన హితవుబట్టి ఈవిషయము అన్నియు స్పష్టమగుచున్నవి. ఎంతటి మహాజ్ఞానియయినను మాయకు లోబడక తప్పదను విషయముకూడ నీతనివలన స్పష్టమగుచున్నది. సోదరుడగు హిరణ్యాక్షుని మరణవార్తవినగానే తపస్స్వాధ్యాయ హూనవ్రతస్థులను వెదకిపట్టుకొని పట్టుకొనిచంపవలసినదిగాను, గోబ్రాహ్మణులను వధింపుమని. వర్ణాశ్రమధర్మములను భంగపర్చవలసినదిగను, వేదములను నాశనముచేయవలసినదిగాను తన సేవకులగు రాక్షసులను ఆజ్ఞాపించినాడు. ఒకప్రక్క తల్లికి తత్త్వోపదేశము కావించినాడు. వేరొకప్రక్క సృష్టిక్రమమునే భంగముచేయు ప్రయత్నముచేసినాడు. ఇది పరస్పర విరుద్ధలక్షణములతోగూడిన ప్రకృతి. ఒకప్రక్క వివేకము, మరియొకప్రక్క అవివేకము పరస్పర సంఘర్షణమునందుచున్నవి. వాని అవివేకమునకు కారణము హిరణ్యాక్షుని మృతికికారణమైన విష్ణువు మీదగల కోపము. ఆకోపమే తీవ్రద్వేషముగ పరిణమించినది.

ప్రహ్లాదుడు రాక్షసవంశములోజన్మించినప్పటికి గుణనిధి. వాసుదేవునియందు నిరంతరధ్యానరతుడు. సర్వావస్థలయందును శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాదకసంధానుడు. పరమభాగవతశ్రేష్ఠుడు. నిశ్చలవైష్ణవభక్తిపూర్ణుడు. ఇన్నిలక్షణములాయనకెట్లు ప్రాప్తించినవి? ఆయన మాతృగర్భమునందుండగా ధర్మతత్త్వమును, నిర్మలజ్ఞానమును నారదుడు బోధించెను. కావుననే ప్రహ్లాదునకు ఆత్మతత్త్వము అవగతమైనది.

పూర్వజన్మమున విష్ణుపాదపద్మములనాశ్రయించినవాడు శాపవశమున రజస్తమోగుణులైన రాక్షసకులమున జన్మించినవాడు హిరణ్యకశిపుడు. ఆవాసనయుండుటచేతనే తత్త్వజ్ఞానపరిచితుడైనప్పటికి విష్ణుద్వేషమును పెంచుకొనినాడు. నారదబోధితుడై ఆత్మజ్ఞానము నెరిగిన ప్రహ్లాదుడు రాక్షసకులమున పుట్టినప్పటికి సంస్కారవశమున ఉత్తమభాగవతుడైనాడు. ఈరెండుశక్తులకు జరిగిన సంఘర్షణమే నృసింహావతారావిర్భావకారణమైనది. ఈ సంఘర్షణశక్తి ప్రహ్లాదుని సంభాషణవలన వ్యక్తమగుచున్నది. ప్రహ్లాదుని పలుకులు హిరణ్యకశిపునిలో ఆవేశమును పెంచి విష్ణుద్వేషమువృద్ధినందించినది. ప్రతిఘటనశక్తిని పెంచినది. ప్రహ్లాదుడు తండ్రి పెట్టిన బాధలన్నిటిని తట్టుకొనెను. హరినామస్మరణమే శరణ్యమని భావించెను. కాని ఎట్టి సహాయమును అర్థించలేదు. మహాప్రభావసంపన్నుడగు ప్రహ్లాదుని వలన మరణముసంభవించునని హిరణ్యకశిపుడు తలచెను. ప్రహ్లాదుని సమాధానములు హిరణ్యకశిపుని హృదయమున తీవ్రద్వేషానలమును కలిగించెను. ప్రహ్లాదుడు_

'పాలింపుము శేముషిన్
న్మూలింపుము కర్మబంధముల సమదృష్టిన్
జాలింపుము సంసారముఁ
గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్'
(స్కం 7-ప 268)

అన పలుకగా హిరణ్యకశిపునకు అంతులేని కోపముకలిగినది. అప్పుడాతడు ప్రహ్లాదునితోడ_

'నాతోడం బ్రతిభాషలాడెదు
జగన్నాథుండు నాకంటెనీ
భూతశ్రేణికి రాజా లేడొకఁడు
సంపూర్ణప్రభావుండు మ
ద్భ్రాతం జంపిన మున్నె వెదకితిన్
బల్మాయి నారాయణుం
దేశద్వీపములోన లేడు మరి
వాఁడెందుండు రాదుర్మతీ'
(స్కం 7-ప 217)

'ఎక్కడఁగలఁడే క్రియనే
చక్కనివర్తించు నెట్టి జాడను వచ్చున్
జక్కడుతు నిన్ను విష్ణునిఁ
బెక్కులు ప్రేలెదవు వానిభృత్యుని
పగిదిన్.' (స్కం 7-ప 272)

అని పలికినాడు. ఈ మాటలు వాని అవివేకమును, మూర్ఖత్వమును వ్యక్తీకరించుటతో పాటు ప్రగాఢమగు విష్ణుద్వేషమును గూడ తెల్పుచున్నవి. ప్రహ్లాదుడు తండ్రిమాటలకు ప్రతిగా_

"కలఁడంభోధిఁ గలండు గాలిఁగలఁ
డాకాశంబునం గుంభినిన్
గలఁడగ్నిన్ దిశలంబగళ్ళ నిశలన్
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ
ద్రిలింగ వ్యక్తులందంతటన్
గలఁడీశుండు గలండు దండ్రి! వెదకంగా
నేల యీ యాయెడన్.'
(స్కం 7-ప 274)

ఇందు గలఁడందు లేఁడని, సందేహము
వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన, నందందే గలడు
దానవాగ్రణి! వింటే'
(స్కం 7-ప 275)

అని సమాధానము చెప్పినాడు. ప్రహ్లాదుని సమాధానముతో దైవ అసురశక్తుల యొక్క సంఘర్షణ పరాకోటినందినది, ప్రహ్లాదుడు విష్ణుఁడు సర్వాత్మకుఁడని, చెప్పగా హిరణ్యకశిపుడు లేడని తర్జించినాడు. నానాజంగమస్థావరకోటర గర్భములందు సన్నిదేశములందు అచ్యుతుడు నరసింహాకృతి నుండెనని ప్రహ్లా

దుడు ప్రతిపాదించెను. తనభక్తుని రక్షించుటకు శత్రుపక్షమును శిక్షించుటకు నరసింహావతారము సమర్థమైనది. ప్రహ్లాద చరిత్రమునందలి ఈ రెండు శక్తుల సంఘర్షణను జిత్రించుట పోతన కథాకథన శిల్పనైపుణ్యమునకు నిదర్శనము.

రసపోషణము :

భాగవతము భక్తి వాఙ్మయమున లోక అమృతభాండము భక్తిభావతరంగ బంధురాపగము. భగవద్దివ్య గుణగణవర్ణనా మహార్ణవము. వేదపురాణ బ్రహ్మసూత్ర మహాభారత ప్రతిపాద జీవసారము. గాయత్రి మంత్రమునకు ఒక మహాభాష్యము పరమభాగవత ప్రోక్తము. ఇక పోతన తెలుగుభాగవతముకూడ మూలానుసారియే. పరమభాగవతుడగు శుకుడు 'సంసార ప్రవిష్టుండైన వానికిఁ దపోయోగాదులయిన మోక్షమార్గంబులు పెక్కులు గలవు. అందుభక్తిమార్గంబుకంటె సులభంబులేదు' అనిపలికినాడు. భక్తి తామస రాజససాత్త్వికములని మూడువిధములుగ తృతీయస్కంధమునకపిలుడు దేవహూతికి భక్తియోగమును దెలుపునపుడువివరించెను. సగుణోపాస నిర్గుణోపాసనలు రెండును భాగవతమున వివరింపబడినవి. ఇట్లు భాగవతమున ఉత్తమభక్తిసంప్రదాయము లనేకములుప్రస్తావింపబడినవి ప్రహ్లాదచరిత్రము భక్తిభావమునకుదాహరణము.ఎన్ని కష్టములెదురైనను శ్రీహరిపాద పద్మములను నమ్మిభక్తినందిన మహాభక్తుడు ప్రహ్లాదుడు. "మౌనవ్రత జపతపశ్శ్రుతాధ్యయనంబులును నిజధర్మవ్యాఖ్యానవిజనస్థలసమాధులును మోక్షహేతువులగు,విననివి పదియు నింద్రియజయంబు లేనివారికి భోగార్థంబులై,విశ్రమించువారికిజీవనోపాయంబులై, డాంబికులకు వార్తాకరంబులై యుండు. శుభఫలంబులుగావు. భక్తిలేక భవదీయ జ్ఞానంబులేదు ఆం. భా. (స్కం 7-ప 366) అని భావించిన పరమభాగవతుడు. భక్తిపరిణతినందిన మహాభక్తుడు. కావుననే భగవంతుడు వారియందను నిలిచి, వారిని కష్టపెట్టినవారిని శిక్షించి తన భక్తరక్షణపరాయణత్వమును నిరూపించుకొనెను. ప్రహ్లాదునివంటి భక్తుల కథలు సామాన్యులలోకూడ భక్తియందు నిష్ఠకలిగించును భక్తిమార్గమును ప్రపంచమున వ్యాపింపచేయుటకు భగవంతుని భక్తరక్షణపరాయణత్వమును తద్ద్వార భక్తియొక్క ప్రాశస్త్యమును నిరూపింపవలసివచ్చినది. కావుననే 'భాగవత కథలలోఁ గలకంటెఁ ప్రచార మెక్కువ. భక్తితత్త్వమును లోకమున వెల్లడించి ప్రజలను ముముక్షువులుగా నొనరింప యత్నించుట గ్రంథకర్త ప్రధానోద్దేశము. అందుచే భక్తివిషయమో, భగవద్ద్విషయమో వచ్చినపుడు కవివారికిఁ గలాదృష్టితో కథలోనవలసినంతకంటె నధికముగా. ప్రాధాన్య మొసంగుచుండెను. అందుచేవాని ముందు అన్యవస్తువుల ప్రధానములై మఱుగుపడిపోవుట సంభవించును. సంస్కృత భాగవతముకంటెను పోతన భాగవతమున నీ పరిస్థితి మఱింత యధికముగా గోచరించును' 'ఆంధ్రమహాభాగవతము-పీఠిక-పుట 68. ఆం.ప్ర. సాహిత్య అకాడమి, ముద్రణము) అను మాటలు ఖిక్కలి సత్యసన్నిహితములు. ప్రహ్లాదచరిత్రమును ఆ బాల గోపాలమును ఆధ్యాత్మికౌన్నత్యముతో పాటు ఆనందముగొలుపు గూడ చదివెదరు. దీనికి కారణము పోతనమూర్తి చిత్రణమునకు ఎక్కువ ప్రాధాన్యము నిచ్చుటయే, మహాకవి పరమభాగవతుడగు పోతన తన భావనాశక్తిచే భగవంతుని రూపమాధుర్యమునూహించి. తన చూపులలో నిలిపికొని, తన్మయతనంది, దానిని ఆ పాతరమణీయముగా జిత్రించెను.ఇందు కుదాహరణముగ ప్రహ్లాద చరిత్రమున నృసింహమూర్తిని జిత్రించిన విధమును పేర్కొనవచ్చును. పోతన నృసింహమూర్తి ఆవిర్భావమును దీర్ఘసమాసములతోను, అనుప్రాసలతోను, ద్రుతగతి సంయుతముగను చిత్రించినాడు. ఈ చిత్రణ మొక సుదీర్ఘవచనముతో సాగినది. ఈవిధముగ చిత్రించుటచే నరసింహరూపము శరీరమునకు రోమాంచమును కలిగించినది. ఈవచనమునకు పిమ్మట పరమేశ్వర లక్షణ లక్షితమైన నరసింహుని అతిలోకత్వమును, హిరణ్యకశిపుని అల్పత్వమును ధ్వనింపజేయుచు అమూలకముగ నొక పద్యమును చిత్రించెను.

'నరమూర్తి గాదు కేవలహరిమూర్తియుఁ
గాదు మానవాకారముకే
సరి యాకారమునున్నది హరి మాయా
రచితమగు యథార్థము గాదన్.'
(స్కం 7.ప 286)

ఈవిధముగా నరసింహుని రౌద్రమును వ్యక్తీకరించుటకు పోతన మూలమునకంటె భిన్నమగు రూపకల్పన మొనర్చినాడు. ఇట్టి కల్పనకనువైనది రౌద్రరసము. ఈ సందర్భమున పోతన నరసింహుని రౌద్రమును ఎనిమిది పద్యములలో వర్ణించినాడు. నరసింహమూర్తి, హిరణ్యకశిపుల యుద్ధమును పోతనపదిపద్యములలో వర్ణించెను. ఈ సందర్భమునాతడు-1. సర్పంబు నొడిసి పట్టు సర్పపరిపంథి నేర్పున. 2. విహంగమ రాజచరణ నిర్గళిత భుజంగంబు చందంబున 3. ఉరగేంద్రుఁడు మూషికంబు నొడిసిన భంగిన్ 4 విహగేంద్రుఁడహి ప్రచ్చుకైవడి అను పోలికలతో దృశ్య సాక్షాత్కార మొనర్చినాడు. ఇట్లు సందర్భమునసుసరించి రసోచితముగ చిత్రించుట పోతన సహజగుణము,

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని హింసించుటయందును, అహింసలనన్నింటిని సహనముతో ప్రహ్లాదుడు భరించుటయందును కాంతకరుణ అద్భుతరసములు పోషింప

# ఎఱ్ఱన కవిత్వము - జనజీవితము

— శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

(గత సంచిక తరువాయి)

భీముడేకాదు భార్యాపహర్తను ఎవరైనా ఇలాగే 'బండి కూడుగ పొడుస్తారు.' అయితే ఇవి భీముడ్ని ఊహించుకొని వ్రాసిన పద్యాలు కావు. ఎఱ్ఱయగారు స్వయంగా అరుదుగానైనా ఇలాంటి దృశ్యాలను చూచారు.

ఆరోజుల్లో తురకలు కనిపించిన స్త్రీనల్లా అవమానించారు. అపహరించారు. చాలామంది పురుషులు తల్లి-చెల్లి-పెళ్ళాం అని చూడకుండా తమప్రాణాలుదక్కితే చాలని పారిపోయారు. ఐతే అందరూ భీరువులే ఉండరు. కొందరు భీములు కూడా ఉన్నారు. వారు తమ స్త్రీల వంక కన్నెత్తి చూచిన తురకలను పై విధంగానే 'రక్తపూరము దొరఁగ' మొఖం పగులగొట్టారు.

నిజానికి ఎఱ్ఱయగారు చెప్పదలచుకున్నది మొదటి పద్యంతోనే పూర్తయింది. కాని రెండో పద్యం కూడా చెప్పారు. అది భీముడి కసి కాదు. తన కళ్ళముందు జరుగుతున్న అత్యాచారాలను చూచి ఎఱ్ఱయగారు పెంచుకొన్న కోపం. దానిని సైంధవుడ్ని కారణం చేసుకొని తీర్చుకున్నారు.

ఎఱ్ఱయ్యగారు తన సకలోహావైభవాన్ని రంగరించి హరివంశం చెప్పారు. ఆ మహాకావ్యంలో ఆయన తననాటి వారి ధర్మనిరతిని, ఆచారాలను, వ్యవహారాలను. ఆహారవిహారాలను, విశ్వాసాలను, వినోదాలను కడముట్ట వర్ణించారు, ఆయన లోకజ్ఞత, పరిశీలన, ఆత్మీయత ఎంతో ఆశ్చర్యం కలిగిస్తాయి.

హరివంశం ఒక కథకాదు. మధురమైన కథల విశిష్టకూడలి. ఆ కథలు రక్తికథలు లేదా భక్తికథలు కావు. అన్నీ యుద్ధాల కథలు. ఆయుద్ధాలు మహాత్వాకాంక్ష కోసం సామ్రాజ్య విస్తరణకోసం-విశ్వవిజేత అనిపించుకోవడం కోసం చేసినవి కాదు. ప్రజల సంక్షేమాన్ని - సాంఘిక సమానత్వాన్ని సాధించడం కోసం చేసినవి.

కృష్ణుడు కంసుడిని చంపాడు అతడు తలచుకుంటే మధురానగరానికి రాజై ఉండేవాడు, కాని కంసుడి తండ్రి ఉగ్రసేనుడిని రాజును చేశాడు. కంసుడి మరణానంతరం ఉగ్రసేనుడు కృష్ణుడివద్దకు వచ్చి ఇలా అన్నాడు.

రాజ్యమంతయు నీసొమ్ము-రాజవీవు
గుడువ గట్టను బెట్టను గొఱత లేక
యేనుగుల గుఱ్ఱముల నెక్కి యెల్లవారు
గొలువ సాధురక్షకుడవై కొలువు మింక!
- హరివంశం - అ 9-ప. 178

కాని కృష్ణుడు ఒప్పుకోలేదు. కంసుడ్ని తాను చంపడం లోని పరమార్థాన్ని ఇలా వివరించాడు.

రాజ్యంబు పనిలేదు-రాజధనంబుపై
నాసయు జొరదు నాయాత్మ-గంసు
దును ముటయును నర్థదోహలంబునగాదు-
వంశపాంసనుడును, వసుధకెల్ల
గంటకుండును గాన గ్రక్కున వానిని
నిట్లు సేసితి లోకహితముగోరి -
యెవ్వారలకు లేని యెసకపు గీర్తి శా
శ్వత మయ్యె నింతియ చాలువాడ-
నింక యెప్పటి యట్టుల యేను బోయి
యాలకదుపులలోన గోపాల కోటి
గూడి యాడుచు నట వన్యకుంజరంబు
రీతి గోరినట్టుల విహరించువాడ!
- హరివంశం-అ. 9-ప. 183

అని చెప్పడమేకాదు "సర్వయదు మధ్యమున భద్రాసనంబున నునిచి సముచితంబుగ నభిషేకిం' చాడు.

పౌండ్రక వాసుదేవుడిని - నరకుడిని చంపాక వారి పుత్రులకే రాజ్యభారం అప్పగించాడు.

దీనిని బట్టి హరివంశంలోని యుద్ధాల తాత్పర్యం తెలుస్తున్నది. హరివంశ తాత్పర్యం కూడా తెలుస్తున్నది. హరివంశం ధార్మిక విజయాన్ని, సత్యప్రతిష్ఠాపనను, ప్రజాభ్యుదయాన్ని, సామాజిక చైతన్యాన్ని హృద్యంగా - అనవద్యంగా వర్ణించే విప్లవకావ్యం.

సరిగా ఎఱ్ఱయనాటి వేమయ్యలు-ప్రోలయ్యలు-కాపయ్యలు తమ స్వార్థం కోసం, తమ అధికారం కోసం యుద్ధాలు చేయలేదు. హిందూధర్మాన్ని రక్షించడం కోసం కత్తి పట్టిన వీరులు వారు. హరివంశ కథలకు-వారి గాథలకుఎంతో సామ్యమున్నది. అందువల్లే ఎఱ్ఱయగారు హరివంశాన్ని ఎంతో ఆత్మీయంగా-మనోజ్ఞంగా మలచారు.

హరివంశంలో జరాసంధుడు పౌండ్రక వాసుదేవుడు - నరకుడు మొదలైన వారి యుద్ధాలు ప్రముఖంగా వర్ణించబడ్డాయి. వీరందరిలోకి జరాసంధుడి యుద్ధాలకు ఒక ప్రత్యేకత ఉంది. అతడు మధుర మీదికి 18 సార్లు దండెత్తి వచ్చాడు 18 సార్లు ఓడిపోయాడు. తక్కిన వారెవరూ మధుర మీదికి రాలేదు. కృష్ణుడే ఎత్తిపోయాడు.

(ఇంకావుంది)

# సుభాషిత ప్రభుత - కాళిదాస గురుత

— డా. తలముడిపి బాలసుబ్బయ్య

మాట మానవునికి సిద్ధించిన నిసర్గ సంపద. కార్యసాఫల్యంలో మంచి మాటకు ఉన్న శక్తి అనంతం. మెత్తని మాటకు సమస్త జీవరాశి తృప్తి పొందుతుంది. మానవుని నాలుక కొసపై సమస్త సంపదలు, బంధుమిత్రులు, బంధన మరణాలు ఉంటాయన్న పెద్దలవాక్కు నిత్యసత్యం. ముఖ్యంగా కార్యార్థులు ఎదుటివారిమనస్సు పల్లవించేటట్లు మాటల పల్లకిలో ఊరేగింపజేయగల మధురవాక్కులవల్ల తీరని కార్యాలుండటం అరుదు.

మంచిగా మాట్లాడటం అంటే కాకా పట్టడం కాదు. కాకారాయుళ్ళకు ఒక్కోసారి కార్యసాఫల్యం కలిగినా, వారు అతి విలువైన తమ ఆత్మగౌరవాన్ని కోల్పోవటం తప్పదు. కాకాపట్టడం అవగుణం. దీనికీ, గుణవిశేషమైన వాక్కౌశల్యానికీ హస్తిమశకాంతరం.

మానవునికి అత్యవసరమైన ఈ వాఙ్నైపుణ్య ప్రభుతను కవికులగురువైన కాళిదాసు తన మేఘసందేశ కావ్యంలో- మేఘుని గురించిన యక్షుని అభ్యర్థనలో అద్భుతంగా పొందుపర్చాడు. అపారమైన తన లోకావగాహనను పెక్కు అర్థాంతరన్యాసాల రూపంగా లోకానికి అందించాడు.

కార్యార్థియైన యక్షుడు నిజకాంతకు మేఘునిద్వారా సందేశం పంపదలచి అతణ్ణి అభ్యర్థిస్తూ ముందుగానే అతనితో

'యాజ్ఞా మోఘావరమధిగుణే నాథమే
లబ్ధకామా' (6-1)

పుష్కలావర్తకాభిజాత్య సంపన్నుడైన మేఘుని అభ్యర్థిస్తూ 'ఉత్తముడైన అతనివల్ల తన పని నెరవేరకున్నా గౌరవప్రదమే' అంటాడు యక్షుడు. 'అయ్యా! నీవు నాకీ పని చేసిపెట్టు. నీవు చేయకున్నా నేను వేరుగా భావించను' అని అంటే ఎవరైనా ఎవరిపనైనా ఎందుకు చేస్తారు. ఇటువంటి మాటలవల్ల కార్యసిద్ధికంటే కార్యహానికే ఆస్కారం ఎక్కువ- అని ఏమాత్రం ఇంగితజ్ఞానం ఉన్నవారికైనా అనిపించడం సత్యం.

వాస్తవానికి ఇదో గడుసుమాట. ఎదుటివాణ్ణి ఉబ్బించి, అతడు తప్పుకోలేని విధంగా అతనిచేత కార్యాన్ని చేయించగలిగిన గొప్ప వాక్పంజరమిది. నిజంగా గొప్పవాడు అర్థిని వ్యర్థపుచ్చడు. 'గొప్పవాడు పని నెరవేర్చకున్నా'- అని అనడం కేవలం మాటవరుసకే. ఈ నిషేధంలో- కార్యాన్ని తప్పక సాధించు అన్న రెట్టించిన ప్రేరణ గర్భితమైంది. ఎదుటివాణ్ణి నీవు గొప్పవాడవు అని పొగడటంవల్ల అతడు పని నెరవేర్చడంలో దృఢచిత్తుడౌతాడు. ఒకవేళ అతడు కార్యాన్ని సాధించలేకపోతే అధమత్వాన్ని పొందగలడన్న హెచ్చరిక, అతడు పని సాధించి- తాను ఉత్తముడేకాని నీచుడు కాదు అని నిరూపించుకొమ్మన్నట్టి సవాలు (Challenge) కూడా ఇందులో గర్భితమైనాయి. దీంతో కార్యసాఫల్యం ఇంకా సుకరమౌతుంది. యాచకుడు- తాను ఉత్తములనేతప్ప నీచులను యాచించేవాడు కాదని- చెప్పుకోవడం వల్ల అతని ఆత్మగౌరవం-అహంభావం ప్రకటితమౌతున్నాయి. అంటే తాను అర్థించి ఒకరి సహాయంతో తన పని చేయించుకొనికూడా తన గొప్పదనాన్నే నిలుపుకొనేవిధంగా- తన పని చేయటం ఎదుటివారికే గర్వకారణం- అన్నభావాన్ని ప్రదర్శించే ఈ మాటలోని గడుసుదనం అనుభవగమ్యం. చూడటానికి పై సూక్తి యాచనలాగున్నా స్వీయాధికారాన్నే ప్రకటిస్తుంది, ఇదే మాటలోని ప్రభుశక్తి.

'ప్రాయః సర్వో భవతి కరుణావృత్తి
రార్ద్రాంతరాత్మా' (82-2)

అంటే సహజంగా ఆర్ద్రచిత్తుడైన వాడు అంటే దయగలవాడు ఎదుటివారి దుఃఖానికి కరిగిపోతాడు- అన్నది మరో వాగ్జాలం. ఎవరైనా తాను ఆర్ద్రాంతరాత్ముడు అని నిరూపించుకోవాలంటే తన శక్తివంచనలేకుండా, స్వచ్ఛందంగనే ఎదుటివారి పనులు చేసిపెట్టాలి. అందులోకూడా ఆ కార్యభారాన్ని పట్టుదలగా తనపై వేసుకొంటేగాని అది సక్రమంగా నెరవేరదు. ఒక కార్యసాధనలో సాధకుడు ఈవిధమైన స్థైర్యాన్ని ప్రదర్శించగలిగితే ఎవరికార్యాలైనా సఫలం కావడంలో విప్రతిపత్తి ఉండదు. నిజానికి కార్యసాధకునికి ఈ మాట ఒక మెత్తని దెబ్బ.

'ప్రత్యుక్తం హి ప్రణయిషు సతా
మీప్సితార్థక్రియైవ' (54-2)

అంటే- యాచకుల అభ్యర్థనకు కార్యానుకూలతను కలిగించడమే సత్పురుషుల ప్రత్యుత్తరం- అని అర్థం. ఇట్లా చెప్పడంలో- సజ్జనులు అర్థుల ప్రార్థనకు- తాము చేస్తామనికాని, చెయ్యము అనికాని వాచ్యంగా బదులు చెప్పక ఏకంగా

కార్యాన్ని నెరవేర్చ చూస్తారన్నది ఇందలి భావం. ఒక వ్యక్తి ఎవరి అభ్యర్థన నైనా — తనకు అవకాశం లేదు. అని తిప్పి కొట్టడానికి వీలులేని వాగ్బంధం ఇది. 'పొగడి నీ కార్యాన్ని దాటించుకొందా మనుకొన్నావేమో. నాకు నీ పొగడ్తలూ అక్కరలేదు నీ పని అక్కరలేదు' అని ఎవరైనా తప్పుకొందామన్నా — కీర్తి అక్కరలేనిదెవ్వరికి? యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్' — అంటే ఏ పని చేసైనా నలుగురిలో గుర్తింపు పొందాలన్న తపన చాలామందిలో అంతర్లీనంగా ఉండటం సహజం. కీర్తి కాంక్ష అన్నది గొప్ప మత్తు 'పతాం-సత్పురుషు లకు' అని గంట కొట్టినట్లుగా పొగడుతుంటే ఎవరుకూడా సహాయవిముఖులు కాలేరు.

ఒక వ్యక్తి తన పని ఒకనివల్ల ఏదో మొక్కుబడిగా, అర్ధఫలితంగా అయిందనిపించుకోవడంలో తృప్తిపడడు. తన పని పూర్తిగా, తృప్తిగా, పూర్ణఫలితంగా నెరవేరాలనుకోవడం సైజం. అయితే చేసేవానిలో పట్టుదల, చిత్తశుద్ధి, సవాలును స్వీకరించి కొనసాగించగల దృఢ ప్రయత్నం మొదలైనవి ఉంటేగాని ఏ కార్యమైనా సఫలంకాదు. అందుకని కార్యసాధకుణ్ని - ముందుగా ఆ కార్య సాధనకు అభిముఖంగా సంసిద్ధునిగావించి మానసిక స్థైర్యాన్ని కలిగించాలి. ఆ పని నెరవేర్చలేకపోతే నలుగురిలో అతడు అపహాస్యం పొందుతాడన్న బెదురు కలిగిస్తే అతనిలో పట్టుదల పెరగటం సహజం. అప్పుడది అర్థి కార్యసాఫల్యానికి తప్పక దారితీస్తుంది.

'కేవానస్య: పరిభవ పదం నిష్ఫలా రంభయత్నాః' (58-1)

వ్యర్థప్రయత్నులైనవారు ఎవరైనా అపహాస్యంపాలు కాకతప్పదు - అన్న మాట సఫల ప్రయత్నానికి మూలకందం.

ఒక యాచకుడు ఆశ్రయునివల్ల తన కార్యాన్ని సానుకూలపరచుకోవడమే కాక, ఆ కార్యం అవిలంబంగా నెరవేరా అని భావించడంకూడా సహజం.

'మందాయంతే నఖలు సుహృదామ భ్యుపేతార్థకృత్యాః' (42-1)

అంటే స్నేహితుల కార్యసిద్ధికై యత్నించేవారు అలసతను చూపరుకదా అని అర్థం. ఇట్లా చెప్పడంలో అర్థి ప్రయోజనాలు రెండు సాధింపబడ్డాయి. తను అడిగినదే తడవుగా ఎగుటి వ్యక్తి ఆ కార్యనిర్వాహణకు అప్పుడికే పూనుకొన్నాడు. (అభ్యుపేతార్థకృత్యాః) అంటూ ముందుగా మాటతో కట్టిపడవేయడం. అంటే అతడు తప్పనిసరిగా ఆ కార్యసిద్ధికి పూనుకొనేవిధంగా అతనికి మానసిక సంసిద్ధతను కలిగించడం మొదటి ప్రయోజనం. దీనివల్ల కార్యం నెరవేరు తుందన్న నిశ్చయం కలుగుతుంది. 'నమందాయంతే ఖలు- అలసతను కార్యనిర్వాహణలో చూపరుకదా అనడంలో ఆ కార్యం సద్యస్సిద్ధి పొందేటట్లు తొందరించడం రెండో ప్రయోజనం. ఈమాట వ్యక్తిని బుట్టలో పెట్టి, అర్థికార్యాన్ని నిశ్చయంగా, త్వరగా చేయించడంలో సఫలమౌతుందన్నది నిర్వివాదం. ఆర్తుల బాధను శమింపచేయడమే ఉత్తముల సంపదల ఫలం-

'ఆపన్నార్తి ప్రశమన ఫలాస్సంపదో హ్యుత్తమానామ్' (57-1)

అన్నది మరో తిరుగులేని వాగ్బంధం. ఉత్తముల సంపదలు ఆర్తుల బాధలను ఉపశమింపచేయడంలో నిత్యసిద్ధంగా తహతహలాడుతుంటాయిఅనడం ఉత్తమమైన గడుసుమాట. సంపదలు అచేతనాలు. అందువల్ల వాటికి స్వయంనిర్ణయాధికారంగాని, కర్తృత్వంగాని ఉండవు. ఆర్తుల బాధలను ఉపశమింపజేసేవాడు ఉత్తముడే. అయితే సంపదలు అతడు చేసే సహాయానికి ఉపకరణంగామాత్రమే అవుతాయి. ఈవిధంగా అచేతనానికి చేతనత్వం కలిగించడంలో- ఉత్తములు నిసర్గపరోపకార పరాయణులు అన్నదే ప్రధాన ప్రయోజనం. ఈవిధంగా చెప్పడంలో మరో గడుసుదనంకూడా ఉంది. ఆశ్రయుణ్ని మానసికంగా అర్థికి సహాయం చేయడానికై ఉన్ముఖుం గావించడంలో ఈమాట అధికారమైన విధిగా పనిచేస్తుంది. తనకు సహాయంచేసి అతని ఉత్తమత్వాన్ని నిలుపుకొమ్మన్న అర్థి హెచ్చరిక, ఇంతగా అర్థించినా కార్యం నెరవేర్చలేని వ్యర్థుడవు కావద్దన్న సవాలు కూడా ఇందులో గర్భితమైనాయి.

ఉత్తములపట్ల ప్రార్థన ఎవరికి ఫలించదు-

'కేషాం ఐ స్యాదభిమత ఫలప్రార్థనా హ్యుత్తమేషు' (56-3)

అన్నమాట ఆశ్రయుల దగ్గర అర్థుల కార్యాన్ని సఫలంచేయించే మహాయుధం. లోకంలో పలురకాలైన బంధాలు (కట్టివేతలు) ఉన్నాయి. వీటి నుండి ప్రయత్నంవల్ల బైట పడవచ్చు. కాని వాగ్బంధం - అంటే మాట ఇవ్వడం - అన్నది పెద్దబంధం.

"బ్రదుక వచ్చుగాక బహుబంధనములైన
వచ్చుగాక లేమి వచ్చుగాక
జీవధనములైన చెడుగాక పడుగాక
మాటతిరుగలేరు మానధనులు' -

అని భాగవత వాక్యం.

'అంగీకృతం సుకృతినః పరిపాలయంతి'- పుణ్యాత్ములు ఆడినమాటను నిలుపుకొంటారు కదా - అన్నవి గొప్పవాగ్బంధాలు. ఇదేవిధంగా పైమాట కూడా. అర్థి అడుగటంలోనే అతనిపని ఆశ్రయుడు తప్పక నెరవేర్చగలడు అనే

విధంగా ఇది ఒక బంధం అయింది. దీని వల్ల ఆర్థికార్థ్య సాఫల్యం నిసర్గళం. వాస్తవానికి ఇట్లా మాట్లాడటం ఒక ఉదాత్త గంభీరమైన కాకాపట్టే విధానమే. అంటే కాకాపడ్తున్నట్లు తెలియకుండా, ఆర్థిక అల్పత్వాన్ని కలిగించకుండా కార్యాన్ని నెరవేర్చే, తుపాకి గుండు లాంటి మాట ఇది.

ఇట్లా ఆశ్రయుణ్ణి 'సత్పురుషుడు, ఉత్తముడు, సుహృత్ (సన్మిత్రుడు) అని చెప్పటం వల్ల కార్యసాఫల్యం నిరాఘాట మౌతుంది.

అయితే వ్యక్తులమధ్య సంబంధం ఇచ్చిపుచ్చుకునే విధంగా ఉంటేనే కల కాలం నిలుస్తుంది. అది ఏకగతంగా (one way) ఉంటే ఆ బంధం నిలువదు. మా ఇంటికివస్తే ఏమి తెస్తావు-మీ ఇంటికి వస్తే ఏమి ఇస్తావు, అన్న విధానం బెడిసికొడ్తుందన్నది అనుభవసత్యం. కృతజ్ఞత మెరుగటం అంటే చేసిన మేలును గుర్తుపెట్టుకొని, తనకు సహాయం చేసిన వారిపట్ల వినయవిధేయతలు, గౌరవభావం కలిగిఉండటం, అవసరమైనపుడు తాను కూడా తనకు సహాయం చేసినవారికి ప్రత్యుపకారం చేయగల్గడం ఉత్తమ లక్షణం.

"నతృప్రోపి ప్రథమ సుకృతాపేక్ష
యాశ్రయాయ
ప్రాప్తే మిత్రే భవతి విముఖః
కింపునర్య స్తథోచ్చైః' (117-1)

పూర్వంచేసిన సహాయాన్ని జ్ఞప్తిలో ఉంచుకొని, ఆశ్రయం కోరవచ్చిన మిత్రునిక్షుద్రుడు కూడా తిరస్కరించడు- మరి ఉత్తముడెట్లాకాదంటాడు, అన్నది మరోగొప్పసూక్తి. ఉపకారగుణం అన్నది మానవుల మధ్య అభిమానాన్ని, ఐకమత్యాన్ని కలిగించి వారి ఉత్తమ సమానజనసహజీవనానికి తోడు పడే గొప్ప సాధనం. సూటిగా చెప్పాలంటే ఉపకార గుణమే మానవ జీవిత పరమార్థం. ఇదే సమసమాజ నిర్మాణానికి ముఖ్యమైన మూడిసరుకు. అటువంటి ఉపకార ప్రాధాన్యాన్ని క్షుద్రుడు కూడా కాదనలేడు అనడం ఉపకార గుణం గొప్పదనాన్ని తెలుపడానికి, మానవులకు కృతజ్ఞతా గుణ ప్రాధాన్యాన్ని బోధించడానికే. చేసిన మేలును మరచిపోకపోవడం గొప్పలక్షణం. మరి అటువంటిగుణాన్ని కలవాడు క్షుద్రుడు (నీచుడు) ఎట్లా అవుతాడు. ఇక్కడ క్షుద్రుడు అన్న మాటకు నీచుడు అనికాదు అర్థం. కనుక అల్పుడు అంటే బలహీనుడు, దరిద్రుడు అని అర్థం. కనుక ; తనశక్తికి మించినదైనా మిత్రకార్యాన్ని ఎటువంటివ్యక్తి అయినా తప్పక నెరవేర్చాలన్న విధి ఈ వాక్యానికి అర్థం.

"నీచైర్గచ్ఛత్యుపరి చ దశా చక్ర నేమి
క్రమేణ (49-2)

మానవుని ఔన్నత్య దౌర్గత్యాలు చక్రంకమ్మివలె క్రిందు మీదులౌతాయి అన్నది మరోగొప్పసూక్తి. బుద్ధిగమ్య బహుళార్థక వాక్యమిది. ఒకవిధంగా ఇది మానవజీవిత సర్వసారాన్ని తెలుపుతుంది. మానవునికి కష్ట సుఖాలు సహజమైన వనీ, కష్టాలకు కుంగిపోయి-సుఖాలకు పొంగిపోగూడదనీ, ఎదుటివాడు కష్టాల్లో ఉండగా చూచి చులకనచేయ కూడదు-తాను కూడా ఒకనాటికి అటువంటి కష్టాలు అనుభవించ వలసిరావచ్చని జాగ్రత్తపడమనీ, కష్టాల్లో ఉండేవాడిని ఆదుకోమనీ, ఎవరికీ కష్టాన్ని కలిగించవద్దనీ, జీవితంలో కష్టాలు కలుగగలవన్న సాపధితితో మంచిజీవనవిధానాన్ని అలవర్చుకోమ్మనీ, కలిగిన దుఃఖాలను ఆత్మశక్తితో అధిగమించి సుఖాలను పొందే ప్రయత్నాన్ని సాహసంతో నిర్వహించాలనీ ఇట్లా మానవ జీవితసత్యాలను ఎన్నిటినైనా ఈ వాక్యానికి అర్థాలుగా గ్రహించవచ్చు. మానవులమధ్య అనురాగాన్ని పెంపొందించి, వారి సహజీవనానికి అవసరమైన ఆత్మస్థైర్యాన్ని మెత్తని పెత్తనంతో శాసనప్రాయంగా కలిగించేది ఈ వాక్కు. వ్యక్తి, దేశం, కాలం మొదలైన వానికి అతీతంగా అంతటా వర్తించేవి ఇటువంటి సూక్తులు. ఈవిధమైన జీవితసారాన్ని అందించగలిగిన మహాకవులే ఎన్నిక ఆవసరంలేని శాశ్వత విశ్వశాసన సభా సభ్యత్వానికి అర్హులు.

కాలం అన్నిటికన్నా బలమైంది కనుక, ఏనాటికి ఏవిధమైన పరిస్థితి ఎవరికి కలుగుతుందో తెలియదు కనుక ఎవరితోనూ దురుసుగా వ్యవహరించకూడదు. విధిగా ఇతరుల కష్టాల్లో పాలు పంచుకొని యథాశక్తిగా వాటిని పోగొట్టే ప్రయత్నం చేయాలన్నది ఈవాక్య పరమార్థం. ఇటువంటి ఒక్కొక్కవాక్యం కూడా ఒక్కొక్క కావ్యంకావడంసత్యం.

ఈవిధంగా కాళిదాసు మంచి మాటలన్న ప్రయుక్తిని ఘంటా పథంగా చెప్పాడు. అంతస్స్వారమైన ఆ కవికుల గురువు వాక్కులోని గౌరవం అనంతం.

ఓం తత్సత్

• • •

డా. తలముడిపి బాలసుబ్బయ్య
9-3-84, కాశీంపురం
సిద్ధిపేట. 502103
మెదక్ జిల్లా.



